చ|| హరనిటలాంబకోదితమహోద్భుతకీలికరాళకీలలన్
దొరలి శరీరముఁన్ విడిచి తోయ్యలులన్ మిడికించ భూత మై
తిరిగి 'యనంగ' నామమునఁ దేజము నొందితి;వే మనందు నిన్,
గరితల నేఁచ హేతువు దగన్ రతిమంగళసూత్రశక్తి యా. ౧౦౬

చ|| అనిలునిఁ బ్రాణ మైనహితుఁ డంచు మనంబున నమ్మినావు గా!
నిను బొలియించునాఁడు హరనేత్రకృశానుకరాళకీలకున్
బనివడి తోడు వోయి నిను భస్మము సేసినపాపకర్ము నే
యనువున నమ్మినావొ? వనజాంబక! నీ కది యెట్లు సహ్యమో! ౧౦౭

సీ|| వీఁడె కా! నీమహాబాడబేద్ధాసంబు
తొడిఁబడఁ బుడమిలో నడఁగఁ జేసె;
వీఁడె కా! నీశాతవిశిఖసందోహంబుఁ
జెలరేఁగి మంటిలోఁ గలిపి వేసె;
వీఁడె కా! నిను గూల్చువృషభధ్వజునికంటి
మంటతో డై నిన్ను మడియఁ జేసె;
వీఁడె కా! నిమూమనూమున కాహార
భూంతుఁ డై యతనిని బొలియఁ జూచె;
తే|| గీ|| వీఁడు హితశాత్రవుఁడు నీకు వీని నమ్మి
యున్న దెల్లను గ్రూరు లొపన్నగముల
నోటిఫలముల కాశించుపాటి యగును;
దెలిసి వర్తించు మిఁక నైన జలజబాణ! ౧౦౮

చ|| చెలఁగి హయంబు కార్ముకముఁ జీల్చెఁ; భటాళి కృపాణజాలముల్
గళగళ మ్రింగె; మార్వి విశిఖవ్రజసారముఁ బీల్చెఁ; మామ నిన్

బాలియఁగఁ జేయువైరితలపు వ్వాయి మించె, వినిర్గతాంగ! యే
చెలువునఁ గూర్చికొంటివో! విశేషముగా గృహకృత్యవైరులన్. ౧౦౯

తే|| గీ|| అంతలో సూత్రవతి సూచి కాంత! యింత
రంతు సేయంగఁ దగునఁటే! కాంతలకును;
జింత సేయకు; వచ్చు నీకాంతుఁ డనిన;
మారు దూఱక వేసారి యూరకుండె. ౧౧౦

ఆశ్వాసాంతము.

కం|| అరుణాంతర్గతశరణా!
శరణాగతభక్తజాతసాక్షాత్కరణా!
కరుణాలసదాచరణా!
చరణాబ్జవిలక్షణైకసదమలచరణా! ౧౧౧

భుజంగప్రయాతము.

బలద్విడ్విరోధ్యస్రపప్రాసధీరా!
దళద్రుద్రకోదండధైర్యప్రచారా!
చలన్నీరదానర్ఘ్యచంచచ్ఛరీరా!
శిలాకామినీకృద్విశేషావతారా! ౧౧౨

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాణమానసమానతూముమంశక్షీరపారావారరాకాసుధాకరరావుక్ష్మాపాలసుపుత్రపవిత్రచరిత్రాక్షీణాంధ్రగీర్వాణచణరామచంద్రావనీపాలవిరచితశ్రీమదలమేలుమంగాపరిణయం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము

# తృతీయాऽశ్వాసము.

కం॥ శ్రీమద్భూమిసుతాఃముఖ
సోమాऽస్తాऽనంద నేత్రసుభగచకోరా!
భీమోద్ధతభృగుకులభవ
రామామితమదవిరామా! రఘుకులరామా! ౧

తే॥ గీ॥ అవధరింపుము శంకరుం డవ్వలికథ
నారదున కేమి సెప్పె విస్తారముగను,
దాని వివరింపవే! యని శౌనకర్షి
యండిగినఁ సూతుఁ డతనితో ననియె నిట్లు. ౨

ఉ॥ తూరుపుఁదెల్పు మించె; భువిఁ దోయజముల్ వికసించెఁ; బుష్పలి
ట్ప్వారము ఝుంకరించె; ఖగవర్గమహాऽర్భటి మించెఁ; గమ్మనౌ
మారుత మేగుదెంచె; విలు మన్మథుఁ డెక్కు డలించెఁ; గైరవ
శ్రీరమ మోము వాంచెను; నశించె నిశారమ వేఁగుజామునన్. ౩

మ॥ మొకమో తైనను లేక పద్మినుల నిర్మోహంబుచే నేఁచుటల్
ప్రకటం బైన నినుండు వచ్చె నదుగో ప్రాగద్రిపైఁ జూడు మో
యి! కలంకీ! యిఁక వేగమే జరుగు సుమ్మీ! యన్న చందంబునన్
గృకవాకుప్రకరంబు వేశ్మములచక్కిన్ నిల్చి కొక్కో! యనెన్. ౪

సీ॥ గగనరమాऽధీశఘనభుజాऽర్గళయుగ్మ
కలితోరుశంఖచక్రంబు లనఁగ,

సమయము త్తేభేంద్రసదమలోభయపార్శ్వ
కలధౌతకాంచనఘంట లనఁగఁ,
జరమపూర్వాధీశవరవధూకరయుక్త
ఘనహీరమణికందుకంబు లనఁగఁ,
బ్రత్యూషభామినీశ్రవణద్వయోజ్జ్వల
ధవళారుణాంచితోత్పలము లనఁగ,

తే॥ గీ॥ నలరుఁరాకానిశాంతపద్మాక్షిచూళి
కాలికాంతరములయందు నమితమౌక్తి
కములబొట్టును రాకిణి యమరె ననఁగఁ
గమలరిపుమిత్రు లొప్పి రకాలమునను. ౫

కం॥ పద్మాఽయితనేత్రాంచిత
పద్మాసద్మాపకారి పాశ్చాత్యం, డీ
ఛద్మకునిఁ ద్రోయ వచ్చునొ!
పద్మాఽప్తుం డనఁగఁ బొడిచెఁ బ్రాగ్గిరియందున్. ౬

కం॥ అనుచున్ శంభుఁడు పల్కఁగ
ననిమిషముని "విని రమేశు నజపాలురు గ
న్గొని నృపతికి వినిపింపన్
జని" రంటి వదేమి? యనిన శంకరుఁ డనియెన్. ౭

కం॥ మానవతీపురమున బుధ
మానితుఁ డౌతూము రామమనుజాధిపుఁ డా
స్థానమున మహోన్నతపం
చాఽనసపీఠాంతరస్థుఁ డై యున్నయెడన్. ౮

సీ॥ సామంతభూపాలసముదాయ మొకవంక,
నొకవంక రణధీరయోధవరులు,
బహుశాస్త్రవిజ్ఞానపండితు లొకవంక,
నొకవంక సరసగాయకచయంబు,
కార్యదీక్షాఽమాత్యవర్యాళి యొకవంక,
నొకవంక సకళంకసుకవిజనులు,
వారవిలాసినీవారంబు లొకవంక,
నొకవంక మాగధప్రకరములును,

తే॥ గీ॥ సందుకొలువున నుండ నాఖండలుండు
ధర సుధర్మాఽంతరస్థుఁ డౌకరణిఁ దనరు
తూముగామావనీపాలత్రోయజారి
కొలువుకూటంబుఁ జొచ్చి రాగొల్లవారు.

కం॥ అరుదెంచినగొల్లలు దా
మిరువురు దండంబు వెట్టి యేలినవాఁ డా
దరమున వెఱఁగునఁ జూడఁగఁ
దఱచుగఁ గాన్కల నొసంగి ధరణీశ్వరుతోఁ.

తే॥ గీ॥ సామి! యీయూరియుత్తరభూమి కైన
కూఁతపెట్టునఁ గాటుకకొండ గలదు,
దాన మేఁకల మేఁప మావానితోసఁ
బోయి కంటిని; మనసు కబ్బురము దోసె.

కం॥ అన నాముచ్చట యేమో?
వినిపించర! గొల్లవాఁడ! వేగిర మనుచున్

జనవిభుఁడు వల్కినంతనె
తనచేతులు మోడ్చి యెడ్డెతనమున ననియెన్. ౧౨

సీ॥ బొలిబొల్లినామాలు గలమేను గలవాఁడు,
సంకుసక్రాలబుజాలవాఁడు,
తెల్లనిముత్యాలడొల్లుఁబోగులవాఁడు,
ఎదమీఁద నెసఁగుజన్నిదమువాఁడు,
జలతారు వాదిగినతలకుల్ల గలవాఁడు,
వలిపంపుతగటుదువ్వలువవాఁడు,
రతనాలు దాపినపతకంబు గలవాఁడు,
సక్కనినీలాలసాయవాఁడు,

తే॥ గీ॥ ఎవ్వఁడో కాని మా బడు నవ్వుకుంట
కాల్లపాకోల్లు మెట్లపైఁ బెల్లు మనఁగ
నల్లకాటుకకొండన మెల్ల నెక్కి
పెద్దగైఁగోనఁ జొచ్చె నీపొద్దె రాజ! ౧౩

కం॥ అని జాబాలురు వల్కిన
మనుజాధిపుఁ డాప్తులైనమంత్రులతోడన్
"మన మేగి చూత మెవ్వఁడో?
ఘనుఁడే కాకున్న నిట్లు గల్గునె? గుర్తుల్. ౧౪

కం॥ దినపూర్వపుణ్యఫల మీ
దినమున ఫలియింపఁ జేయుదేవుఁడు గాఁబో
లును భీకరగిరిగుహాలో
జనమాత్రుఁడు సొరఁబడంగ శక్తుం డగునే! ౧౫

తే॥ గీ॥ ఐన మన మేగి చూత మయ్యది నిజంబొ?
లేక మిథ్యయో? యిది గట్టి గాక యున్న
జనులు నవ్వుదు రింక నిజంబు దెల్పుఁ
డనుచు గొల్లల నడుగుఁడీ!" యనిన వారు. ౧౬

తే॥ గీ॥ ఉన్న దున్నటు మీ రందుఁ గన్న దెల్లఁ
గల్ల లాడక తెల్పుఁడో గొల్లలార!
రాజు సూడఁగ మీవెంట రాఁ గలండు.
ననుచు నడిగిన నాభీరుఁ డనిరి యిటులు. ౧౭

తే॥ గీ॥ అబ్బతో డబ్బ! దబ్బఱ లేదు; నిబ్బ
రమునఁ జూస్తిమి; మీ రింక రాండి సూడ;
దర్లపసికెలు మేసెటిగొర్లనడిమి
కెల్లి వచ్చెను పసుపొన్నెవల్లెవాఁడు. ౧౮

చ॥ అనిన నమాత్యవర్గము నృపాగ్రణితో "నజపాలశేఖరుల్
ఘనవిభగాత్రు నిక[illegible]ముగఁ గన్గొనినా" మని పల్కుచున్న వా
రనిమిషరాజభోగసదృశాంచితవైభవ! యెన్నిభంగులన్ మన
మటు వోయి చూడ కనుమానము వాయ దటంచుఁ బల్కఁగన్. ౧౯

ం॥ ముందర నిలిచిన సేవక
బృందముఁ గని పిల్వఁ బనిచెఁ బృథ్వీశ్వరసం
క్రందనుఁడు గజతురంగ
స్యందనపరిరూఢవీరసైనికవరులన్. ౨౦

కం॥ సిద్ధాంతులఁ గన్గొని పరి
శుద్ధదినం బడుగ 'నిపుడె శుభ' మం చనినన్.

కమలకు శుభమే కద! యో
కమలాన్వయకమలరాశికమలవిరోధీ! ౧౩౪

మ॥ రమ నీయందు జనించినందువలనన్ రంజిల్లు నీపోలికల్
విమలాఽస్యాక్షికరాంఘ్రియుగ్మములు భావింపంగ నాకన్నులన్
గమలాదేవినిఁ జూచినట్ల యగు నిన్గన్గొన్న నిక్కంబు సం
భ్రమ మందెన్ జుమి! నాహృదబ్జ మిపు డో రాజీవరాజేశ్వరా! ౧౩౫

క॥ చక్రాంగప్రియమవు గద!
చక్రాంకుఁడ సుమ్మి! నేను సరసీరుహాభూ
చక్రాధిప! నన్నాశ్రీ
చక్రస్తనిఁ గూర్చి ప్రియము సల్పం గదవే! ౧౩౬

కం॥ అని వనజము నివ్విధమున
వినుతించి మురాసురారి వేసరి చింతా
వననిధినిమగ్నచేతో
వనజుం డై రాజువదనవనజస ... జ...

ఆశ్వాసాంతము.

మ॥ రవివంశార్ణవసోమ! సోమసవభుగ్రాజాబ్జభూ...
స్తవనీయోజ్జ్వలపాద! పాదతలయోషాభూతపాషాణ! ...
నివరాంభోరుహపాణి! పాణిధృతసిద్దదా...మర ద్వేషి! రా
జవిదారోద్ధతపత్రి! పత్రివరరాజైస్తైంధవాఽరోహణా! ౧౩౭

ఉత్సాహ॥ ఖరసురారివరవిదార! కలితసారకాంచనో
త్కరనిశారదశశతారదరకరారవింద! సా
గరగభీర! నగసుధీర! ఘనవిసారకేతుసుం
దరశరీర! హారశరాఽసదశనశూర! భూవరా! ౧౩౯

## గద్య.

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాఽస్వాదనతుందిలేందింది
రాయమానమానసతూమువంశక్షీరపారావారరాకాసు
ధాకరరామక్ష్మాపాలసుపుత్రపవిత్రచరిత్రాక్షీణాం
ధ్రగీర్వాణచణరామచంద్రావనీపాలవిరచిత
శ్రీమదలమేల్మంగాపరిణయం బనుమహా
ప్రబంధంబునందుఁ దృతీయాఽశ్వా
సము సంపూర్ణము.

ఓం

## చతుర్థాఽశ్వాసము.

క॥ శ్రీకోసలరాట్తనయాఽఽ
లోకనవికచాబ్జ! లోకలోచన! విలస
త్ప్రాకాహితలోకాహిత
లోకాహిఖగేంద్ర! సకలలోకనరేంద్రా! ౧

తే॥ గీ॥ అవధరింపుము! యాఁటమీఁద సజ్జనాళి
యేమి సెప్పెను! సురసంయమీశ్వరునకు;
వినఁగ నవి మాకు వివరింపు విశ్రుతముగ
సూత! సముపేతహరికథాఖ్యాతచరిత! ౨

క॥ అన సూతుఁడు శౌనకముఖ
మునికులతిలకులను గాంచి ముదితాఽత్ముండై
"వనజోదరుదివ్యకథల్
విన వలసితిరేని మీరు వినుఁ"డని పలికెన్.

ఉ॥ రామధరాఽధినాయకునిరాజనిభాఽస్యముఁ జూచి శౌరి "నేఁ
బామును బట్టెదన్, జ్వాలను బట్టెద, సంగజునైనఁ గొట్టెదన్,
భామరో! నిన్ను బాయ నని బాసలు సేసెద నంటి"నంచు నా
శ్యామకుఁ జెప్పి పిల్వు మొకసారిఁక వేఁడెద నిన్ను భూవరా! ౪

మత్తకోకిల॥ అనుఁచు నాసతి యిచ్చినన్ సిటలార్పితాంజలిబంధుఁడై
మనుజనాయకుఁ డిట్లు పల్కె సమందవాగ్విభవంబునన్

దనుజమర్దన! యివ్విధంబున దాసునిఁ బ్రీతిమాలఁగాఁ
జనునె? నీ విపు డాన తిచ్చిన సత్వరంబున నేగెదన్.

కం॥ మీయాజ్ఞోల్లంఘనమును
జేయఁగ నే నెంతవాఁడ శ్రీవర! ముసు నేఁ
బోయిన రా ననెఁ గద! "వేం
చేయఁగవలె మీరె యటకు శీఘ్రం" బనినన్.

మ॥ హసనాంచన్ముఖుఁ డౌచు దైత్యమథనుం డాహ్లాది యై యిట్లు నే
నసమాస్త్రాంబకుబాధ కోర్వక నితాంతాఽసక్తిమై వత్తునే
నసమానోజ్జ్వలబుద్ధిధుర్య! విన వయ్యా! యీధరామండలిన్
రసికుల్ విన్నను రామ రామ! నగరా! రామావనీపాలకా!

కం॥ అలు గనుక నీవె చని యా
కుటిలాలకతో "మహాగ్రికసుమాఽయుధదు
ర్ఘటపటుశరపీడితహృ
త్పుట మింక నెటు లౌనో? చూచి పొమ్మనె"ననుమా!

చ॥ అనిన నమస్కరించి దరహాసమనోజ్ఞముఖారవిందుఁ డై
చనియె నదభ్రవేగజితసౌరభవాహుఁడు నై ముదంబుతో
జనవరుఁ డచ్యుతాంఘ్రియుగసారసభక్తినియుక్తనైజహృ
ద్వనజవికాస మొంద వనవాటికి నిందిర యున్నచోటికిన్.

ఉ॥ పోయి సరోజమందిరకు భూవరుఁ డచ్యుతపాదనిశ్చల
స్థాయదనారతోత్కలితభక్తిహృదబ్జుఁడు మ్రొక్కి-నన్, హరి

ప్రేయసి గారవించుచు "పరీస్పృహ వైరితురంగుఁ డేమనెన్?
నాయెడ నల్గినాఁడొ? కరుణాపరుఁడై నను బిల్వ నంపెనో? ౧౦

కం॥ బొంకిన నఘ మనుచును బుధ
శంకరు లను చుండ వినవె! జననాయక! మీ
నాంకగురుం డే మనెనో?
బొంకక నాతోడఁ దెల్పి పుణ్యముఁ గనుమా!" ౧౧

కం॥ అన విని జననీ! నీ విటు
లనఁ దగునా! దాసజనుని; నచ్యుతునా వే
దన యే మని చెప్పుదు? "రా
నని నిందిర" యనిన మూర్ఛ నప్పుడె చెందెన్.

ఉ॥ అంతట మూర్ఛఁ దేరి నరకాంతకుఁ డల్లన జేతులన్ ధరా
కాంతపయిన్ ఘటించి తనుకంపము నొందఁగ లేచి "యింక నే
నెంతకు నోర్తుఁ గంతునిశితేషుభితాననితాంతతాపసం
క్రాంతహృదబ్జ? మెట్లొ దయ గల్గినఁ గన్నులఁ జూచి పొమ్మనెన్ ౧

చ॥ "నిజముగ నేఁటినుండి యిఁక నిన్నెడఁ బాయను నమ్ము"మంచునా
గజగమనాలలామకును గట్టిగఁ దెల్పుము; "నమ్మకున్నఁ బు
ణ్యజనచయఘ్న కిల్బిషము నందెద"నం చను; మిందు కాసతీ
వ్రజమణి యొప్పకున్న "వనవాసమె వ్రాసిన" దంచుఁ బల్కుమా! ౧
౧

వ॥ అని మఱియు ని ట్లనియె.

తే॥ గీ॥ నిక్క మీమాట మాయమ్మ! నీవిభుండు
నీవు రాకున్న నిమిషంబు నిల్వఁడచట

వచ్చు నీచెంత కిప్పుడె మచ్చెకంటి!
జాగు సేయక రావమ్మ! వేగముగను. ౧౬

కం॥ అన విని "పుణ్యాజనంబులు"
నన<గా విను యాతుధాను లయ్య! కృపాలా!
"వన" మన<గా నుదకంబును;
హాసననివాసముల కతని కవి యోగ్యము లే ౧౭

కం॥ "మాధవు<" డనునామము మా
యాధవు< డై యునికిచేత నన వలసె< జుమీ!
యీధారుణి వేధస్సమ
మేధానిధు లతనిమాయ మించగ గల రే! ౧౮

చ॥ ఇతరజనవ్రజంబు ధరణీశ్వరచంద్ర! "దరాదిశోభితా
యతకరిరాట్కరోపమభుజార్గళభూరితరప్రతాపని
ర్జితమహితామరాహితవరేణ్యు<" డనంగ< బ్రసిద్ధు< డై నయ
చ్యుతుఘనమాయ దా<టుటకు< జోద్యము గాద<టె! యెన్ని భంగులన్ ౧౯

గీ॥ రామభూమీశ! హరిమాయ లేమి సెప్ప
నద్భుతంబులు; "సర్వజ్ఞు లై నయట్టి
మునుల నెల్లర మోహితాత్ములుగ< జేసె"
నన్న నెవ్వరివశ మగు నన్న! యనిన. ౨౦

కం॥ లే దమ్మా! "హరి మిథ్యా
వాదుండును గా<డు, సత్యవాక్యుం" డనుచున్

వేదంబులు వలుకును; మీ
పాదంబులతోడు పిలువఁ బనిచెను నిన్నున్. ౨౧

మ॥ నను జాలన్ బ్రియవాక్కులన్ బిలిచి శ్రీనాథుండు "నాయన్న! నా
వనితన్ దోడుక రమ్ము పొ"మ్మనిన నవ్వా! వచ్చితిన్, నీవు "రా"
ననుచున్ నన్ను నిరాకరించినను నే నచ్చోటి కేచందమున్
జనుదున్? "నన్ దయఁ జూచి ర"మ్మని నమస్కారంబుఁ గావించినన్ ౨౨

మ॥ శతపత్త్రాంచితపత్త్రలోచనము లాత్మా జానిపై నిల్పి యో
క్షితినాథేశ్వర! నీమనోదృఢత, నీశీలంబుచే, నీమహా
ద్భుతనిశ్చంచలభక్తి, మెచ్చితిని; నీతోఁ గూడ నే వత్తు; న
చ్యుతుఁ డే మన్నను నీదె భారము సుమీ! క్షోణీసతీసాక్షి గాన్ ౨౩

కం॥ అని లేచి దిగ్గునని యా
వనజాఽలయ చెలులు రామవసుధాఽధిపుఁడున్
దనవెంబడి రాఁగను సం
జనశైలాఽరోహణంబు సల్పఁగఁ దొడఁగెన్. ౨౪

సీ॥ సెలయేటినీటిలోపల మోముఁ గని యుత్ప
లాంచితాబ్జం బని యందఁ బోవు;
మగటూల నూగారుజిగినీడ గన్పింపఁ
గాలాహి యని చాలఁ గలువడించుఁ;
గలువరాచలువ మెట్టులఁ దోఁచుపదరక్తి
మము కోకనదము లన్ భ్రమ వహించుఁ;

దతసానుగత మైనతనులతాద్యుతిఁ గాంచి
హైరణ్యభూధరం బని తలంచు;
తే॥ గీ॥ నిందిరాకాంత హృదయేశసుందరాంఘ్రి
జలరుహార్పితనై జనుస్వాంత గాన
ముగ్ధచందానఁ దనతనూస్నిగ్ధరుచులు
దెలియఁ జాలక చనియెఁ గుత్కీలమెక్కి. ౧౫

సీ॥ కంఠీరవసమీపఘనసారతలువుల
నలరుచుండెడిమహాకలభములను,
గాంచనసుమనికటాంచితాబ్జముమీఁదఁ
జెలరేఁగి విహరించునలికులముల,
సాంకవపరిమళాఽఽసన్నచంచద్బింబ
ఫలము లాసించెడిచిలుకగముల,
వల్మీకనిర్గతవ్యాళోగ్రభోగాగ్ర
ములఁ జెరించెడికోకములగణంబు,
॥ గీ॥ నచలమునఁ జూచి చనుచుండునటులనుండు
నడుము, తొడలును, నడుపంద, మడలుముక్కు,
వదనము, మలకలు, గంధంబు, పెదవి, పల్కు,
నాభి, నూఁగారు, కుచములు శోభిలంగ. ౧౬

కం॥ ఇవ్విధమున నృపుతో నా
జవ్వని యచలంబుపైకిఁ జనుదెంచునెడన్.
దవ్వులఁ గని ముసిముసినగు
నవ్వుచు హర్షించుచుండె నగధరుఁ డంతన్. ౧౭

మ॥ భవదీయోజ్జ్వలపాదపద్మయుగముం బద్మాసనాజ్జారిభృ
త్సవభుజ్ముఖ్యసురుల్ మునీంద్రులుఁ గనం జాలంగ లే రంచు శ్రీ
ధవ! వేదార్థము దెల్పు చుండుఁ గద! దృగ్ద్వారిద్ర్యముల్ దీఱ నీ
భువి నేఁ జూడఁగ నేమి సేసితినొ! కా పూర్వంబునం బుణ్యముల్. ౫౭

కం॥ వారటయుగ, కిరి, హరి, వటు,
పారశ్వధిక, నృప, సీరి, బౌద్ధ, సుకల్క్యా
కారంబులు ధరియించిన
శ్రీరమణుఁడ వీవె కావె! శృంగారనిధీ! ౫౮

మ॥ రసనాయుగ్మసహస్రముం గలిగి సర్పస్వామి వేనోళ్ళ నీ
యసమప్రౌఢచరిత్రముల్ వినుతి సేయం బూని తా నంతటం
బస లేకుండఁగ సెజ్జ యై గొడుగు నై భద్రాసనం బయ్యె;నే
రసనం గల్గితి నొక్కఁడే; యెటులు నిం బ్రార్థింతు విశ్వాత్మకా! ౫౯

కం॥ అనుచున్ వినుతించిన విని
వనమాలి నృపాలుఁ జూచి వార్షికఘనగ
ర్జనసన్నిభబంధురస
స్వనమున ని ట్లనుచుఁ బల్కె సదమలకృపతోన్. ౬౦

కం॥ ఓనరవర! నీ వెవ్వఁడ
వీనగగహ్వరము సొరఁగ నేటికి నీకుం?
మానవరూపముఁ గనుఁగొన
కే నుండు మునీంద్రవృత్తి నిచ్చట ననినన్. ౬౧

తే॥ గీ॥ సకలమానవహృజ్జలజాతపీఠి
కాఽంతరాఽవాసమును గల్గి యబ్జనాభ!
మునిజనులవృత్తి కెల్లను మూల మైన
దేవతాసార్వభౌముఁడ వీవె కావె! ౬౨

కం॥ అనిన& నీనామం బే
మని యడిగిన "రాముఁ"డందు రవనిజనంబుల్,
వనజోదర! నీపదయుగ
వనజంబులసేవ సేయ వచ్చితి ననినన్. ౬౩

కం॥ కరుణానేత్రాంచలములు
నరవరుపై నిలిపి శౌరి నగుమొగమున భూ
వర! ని న్నొకమా టడిగెద,
వెఱఁ గొందక దీనిఁ దెల్పు విమలమనీషన్. ౬౪

శా॥ సద్యఃఫుల్లవిశాలనేత్ర విలసచ్చంద్రాఽస్య సౌందర్యజి
ద్విద్యుద్వల్లరిఁ గౌముదీస్మితఁ గన ద్వేణీజితాంభోధరన్
హృద్యోద్యదంచితనూత్నవిస్ఫుటలసద్దేవాఙ్గహస్తోజ్జ్వలన్
మాద్యద్దంతిసమానయాన నలమేల్మంగాఽంగనన్ జూచితే? ౬౫

కం॥ చెలితో నే నొకమాటకు
నలిగితి; నీపర్వతమున కరుదెంచితి; నే
నిలఁ జాల నేమి సేయుదు
నలివేణిన్ విడిచినదిగ నవనీనాథా! ౬౬

కం॥ ఒకనిమిషం బొకదివసము,
నొకదివసం బొక్కనెలయు, నొకనెల యొకయేఁ,

చ॥ మగువసుధారసాధరసమప్రభ నొందెద మంచుఁ గెంపులున్
బగడములున్ బ్రవాళము లపాస్తరుచిత్వము నొంది నిల్వ చె
క్కుఁగఁ బడి, తంతుసంతతులకట్లకు లోనయి, నేల వ్రాలె; న
య్యగణితరూపగౌరవమహాద్భుతసంపద చెప్ప శక్యమా! 23

సీ॥ పణతిముఖము మహాపద్మసంకాశంబు,
సతినేత్రములు పద్మసన్నిభములు,
చంద్రాననకంఠంబు శంఖసమానంబు,
రమణిజంఘలు మకరములఁ బోలుఁ,
గామినిపాదముల్ కచ్ఛపసమములు,
కోమలిదంతాళి కుందపాళి,
బాలికకచములు నీలోపమానంబు,
లమరఁగా నిధిసప్తకమువిభూతి

తే॥ గీ॥ సంగములఁ బూనియును ముకుందాభిధాన
నిధినిఁ దనయందుఁ బూనదు నీరజాక్షి,
వర 'ముకుంద' నామమున నేఁ బరఁగు చునికి;
స్త్రీలు వరుపేరు నుడువను సిగ్గువడరె? 24

తే॥ గీ॥ వజ్రహారాన్వితం బైన వనితకుచయు
గంబుతోడను దుల్యంబు గాఁ దలంచి
వజ్రనిర్భిన్న మై నగవ్రాత మిలను
గూలి, ధృతి దూలి, గతి మాలి, జాలి నొందె. 25

కం॥ నిజమె కద! కౌను సన్నము
గజయానకుఁ గల్గి యుంట, కచకుచజఘన

వ్రజనిజభారముచే న
య్యజకృత మది యేమొ! తాళు టది నిజమె కదా! ౮౭

కం॥ కాంచినిఁ గాంచిన నాసతి
కాంచినిఁ గాంచినసమంబె కద! హస్తిగిరి
పాంచితగతిఁ గుచగౌరవ
చంచద్వైభవవిలాససహితం బగుటన్. ౮౮

కం॥ కల నైనఁ గాని నన్నా
జలజాఽయతనేత్ర పాయఁ జాలక వక్ష
స్థ్సలమందే యుండును; నా
లలనను నేఁ జూడ కెట్టులను నిల్తు నృపా! ౮౯

ఉ॥ రామవసుంధరాఽధిప! మరాళవిరాజితయాన యిందిరా
రామకు నిర్నిమిత్త మపరాధము సేసినపాప మిప్డు నన్
గామశరస్వరూప మయి గాసిలఁ జేయుచు నున్న దయ్య! యా
మామహిళావతంసము నమందగతిన్ జని తోడి తే గదే! ౮

మ॥ అనుచున్ గేశవుఁ డాన తిచ్చిన నమందాఽనందచేతస్కుఁ డై
మనుజాధీశుఁడు వల్కె ని ట్లనుచు నామాయామానిసిరత్న మే
జనమాత్రుండను నాకు నెవ్విధము సాక్షాత్కార మౌ; నైన నా
మెను వైకుంఠముఁ బోయి పిల్వఁగను స్వామీ! నేను శక్తుండనే! ౯౧

వ॥ అనిన రమాధవుండు క్షమాధవున కి ట్లనియె. ౯

పంచచామరము॥ నృపాలచంద్ర! నన్ను బాసి నిల్చి యుండ నోపునే!
క్షపాదినంబు లెంచ కీరసాప్రదేశమందుఁ దా

నపారమోహమానసాబ్జ యై పయోధికన్య ది
గ్ద్విపాధిరాజయాన మద్గవేషణం బొనర్పదే? ౮౨

తే॥ గీ॥ కాన నీ వేగి భూమిలోఁ గాననములఁ
బురములందును మునులకాపురములందు
వెతకి తోడుక రమ్మ! యీవెతకుఁ జాల
జాలి నొందెద; నిఁక నోర్వఁ జాల నయ్య! ౮౩

చ॥ అని తనవ్రేలిముద్రిక నృపాగ్రణిచేతికి నిచ్చి పచ్చవి
ల్తునివిషజాతతీవ్రతరదుస్తరశాతమహోగ్రబాణసం
జనితకరాళకీలలు రసాధవ! యోర్వఁగ లేను; ముద్ర యా
వనితకు నిచ్చి తోడుకొని వచ్చిన నీ కొనఁ గూడుఁ బుణ్యముల్. ౮౪

॥ అనినంతనె నృపవర్యుఁడు
వినయంబున హరికి మ్రొక్కి వీడ్కొని చని యం
జనగిరినికటంబునఁ గల
వనజాకరతీరభూమివనముల నెల్లన్. ౮౫

ం॥ వెతకుచుఁ జని ముందట నొక
వితతోజ్జ్వలవిస్ఫుటారవిందామందా
యతజలజాకరమును భూ
పతి గనుఁగొని విమలసలిలపానేచ్ఛఁ జనెన్. ౮౬

గా॥ ఆ కాసారసమీపభూమిని వయస్యారత్నముల్ గూడి నా
ళీకావాసవిలాసినీమణిని జాలిన్ దూల లాలించున

స్తోకాఽరావము నాలకించి సతు లిచ్చో నెవ్వరో? యిందిరా
రాకారాజనిభాస్య యేమొ! యిటకున్ రాఁ బోలు నంచున్ జనెన్. ౮౭

కం॥ అంతట వచ్చెడుపృథ్వీ
కాంతుని శ్రీకాంత గని యకారణ మితఁ డీ
కాంతారమునకు వచ్చునె!
కాంతునిపనుపుననె వచ్చెఁ గావలె ననుచున్. ౮౮

మత్తకోకిల॥ రాజచంద్రునిరాకఁ గాంచుచు రాజసోదరియున్ సఖీ
రాజవక్త్రిను జూచి యి ట్లనె రామ! యెవ్వరో! కాని స
ద్రాజసన్నిభ తేజుఁ డీతనిరాక యెందుకొ? సౌరరా
డ్రాజభక్తనిభప్రభావవిరాజమానుఁడు చూడవే! ౮౯

చ॥ సనకసనందనాఽదివరసంయమివర్యులలోన నెవ్వఁడో!
ఘనుఁ డటు గాక యుండిన నఖర్వసుపర్వమునీంద్రచిహ్నముల్
మనుజుల కేల కల్గు? ననుమానము లే దితఁ డచ్యుతాంఘ్రిజీ
వనరుహభక్తుఁడే! నిజము; వారిజనాభుఁడు పంపెఁ గావలెన్. ౯౦

కం॥ అని యివ్విధమునఁ జెలితో
ననుచుండఁగ భూవరుండు నల్లన నికటా
వనికిన్ జనినను గని శ్రీ
వనితామణి వల్కె నిట్లు వసుధాఽధిపుతోన్. ౯౧

కం॥ పే రేమి? నిన్ను జూచిన
ధారుణిపతి వనుచుఁ దోఁచె ధరణీస్థలిలో

మారరమణునిఁ జూచితివే!
కూరిమితోఁ జెపుము వేఁడుకొనియెద ననినన్. ౯౨

క॥ నా పేరు 'రాముఁ' డందురు
భూపతికులజుండ; దేవపూజ్యుం డదుగో!
నీపెనిమిటి గలఁ డమ్మా!
యీపర్వతగహ్వరమున నిందునిభాఽఽస్యా! ౯౩

క॥ అని హరి తన కిచ్చినయా
ఘనమణిసంచయయుతోర్మికను నిందిరకున్
వినయంబున నొసఁగుచు నా
జనపాలుఁడు సాఁగి మ్రొక్కి సన్నిధి నిలిచెన్. ౯౪

ఉ॥ ఆనవరత్ననూత్నఘటితాంచితకాంచనచంచదూర్మికన్
మానలినాక్షి గైకొని జనార్దనునంగుళిభూషణంబ! యా
మీనతురంగపుంగవుఁ డహీనశయానుఁడు లెస్స యుండెనే?
తా నెట నున్నవాఁడో! యిఁక దాఁపక తెల్పవె! నిన్ను వేఁడెదన్. ౯౫

చ॥ హరి నిను వ్రేల నుంచుకొని యంబుధిలో వటపత్రతల్పమం
దరుదుగ వాలి క్రిందఁ దనహస్తముఁ జేరిచి పవ్వళించున
త్తఱి భవదీయసంగమునఁ దా జలరాశివతంసుఁ డయ్యెయిన్
ధరణి 'సముద్రుఁ' డంచు నభిధానము నందెను ముద్రికోత్తమా! ౯౬

వ॥ ఇవ్విధంబున సమ్ముద్దుటుంగరంబును గరంబు వినుతించి కన్నుల నొ
కొని చెక్కుల హత్తించి యక్కునన్ జేరిచి యక్కువలయా
మిక్కిలిమక్కువతో ని ట్లనియె. ౯

శా॥ నే నే మంటి విధాతృతాత? నపుడున్ నీవే కదా! సాక్షి తా
నే నామీఁద దయావిహీనమతి యై నిష్కారణంబే ననున్
దీనత్వంబునఁ గుందఁ జేసెఁ గద వే! దివ్యోర్మికారత్నమా!
నే నేరీతిఁ దరింతు మన్మథశరాగ్నిస్ఫారకీలావళిన్? ౯౮

కం॥ అని మఱియు రాజపుంగవుఁ
గని నీ రేజశయన యనఘా! నిను 'నే
మను' మని హరి దాఁ బనిచెను
వినిపింపు గదయ్య! రామవిపులాధిపతీ! ౯౯

కం॥ దానేనసూను! సూనవి
తానేషుసమానరూప! ధరణీభృన్మౌ
ళీనాతిధీర! ధీరజ
నానూనసరోజషండహారి! హరిశౌర్యా! ౧౦౦

కం॥ శేషాహిరాజశయనువి
శేషాంచితవార్తఁ దెలిపి చిత్తాంబుజసం
తోషముఁ గావించితివి వి
శేషగుణకలాప! రూపజితసుమచాపా! ౧౦౧

కం॥ నిను గన్నతల్లిదండ్రుల
ఘనతరపుణ్యప్రభావగరిమం బిలలో
వినుతింపఁగ ననిమిషవర
వనభవభవభవుల కైన వశమె? నృపాలా!

శా॥ అన్నా! రామనరేంద్రచంద్ర! హరి యే మన్నాఁడో! కా న
మ్మన్నాఁడా? దయతోడఁ దెల్పఁగద వయ్యా! వేఁడెదన్ నిన్ను నా

యన్నా! నీవు యశోధురంధరుఁడ వై యశ్రాంత మీభూమి శ్రీ
మన్నారాయణపాదభక్తిఘనసామ్రాజ్యుఁడ వై యుండుమా! ౧౦౩

కం॥ రమ్మనెనా? నాదే నే
రమ్మనెనా? తనకు నాకు రమణుం డిఁక దూ
రమ్మనెనా? నను మణిహా
రమ్మని హరి తనభుజాంతరమ్మునఁ గొనునా! ౧౦౪

వ॥ అనిన రమాకాంతకు క్షమాకాంతుం డిట్లనియె. ౧౦౫

కం॥ అమ్మా! నిన్నుఁ రమ్మనె
నమ్మా! యామాధవుండు ననుమానము లే
దమ్మా! మదిలో నిజ మను
కొమ్మా! నామాట నమ్ముకొమ్మా! కొమ్మా! ౧౦౬

కం॥ రావమ్మా! పోవుద మిఁక
నీవల్లభుఁ డెదురు చూచు నీరాకకునై
భావభవాంబక పీడిత
భావుం డై; వేగ పదవె! పదవుల సుదతీ! ౧౦౭

వ॥ అనిన రమాదేవి యిట్లనియె. ౧౦౮

కం॥ వనమాలి "నాకు ననపా
యినివి నిన్నుఁ బాసి యుండ నిది నిక్కముగా
మనమున నమ్మ" మటని నను
దనయెదఁ జేర్చుకొని మాటఁ దప్పెనమీఁదన్. ౧౦౯

తే॥ గీ॥ ఏమి వత్తును? నే నిఁక రామభూప!
దైవ మింతైన దయ లేక తప్పు లేని

మాట చేపట్టి నన్నింటిపాటు విడిచి
చనియె నిఁక నేను వచ్చినఁ జక్క నగునె? ౧౧౦

అనుచు నీరీతిఁ బల్కి యవ్వనజభవన
మనుజవరునకుఁ దనచేతివనజ మిచ్చి
"దనుజహరునకు నొసఁగుచుఁ దనుజవనజ
ఘనశరాళికి నోర్వ లే" ననుచుఁ జెపుమ! ౧౧౧

అని యివ్విధంబున నిందిరాదేవి పల్కిన "శ్రీమన్నారాయణుండు నన్ను మన్నన సేసి యక్కన్నియ యెందున్న వెదకి తోడుక ర" మ్మనియె; నిప్పు డీయమ్మ రాను సమ్మతింపక "క్రమ్మఱి నూరక పో" మ్మనుచున్న "దమ్మాధవునకు మనంబు సమ్మతంబు గా నెవ్విధంబునఁ జెప్ప వలయు" ననుచుఁ జెంతఁ జింతాక్రాంతుం డై నిలుచున్న భూకాంతునకు శ్రీకాంత వెండియు ని ట్లనియె. ౧౧౨

మనమునఁ జింత నొంది యనుమానము సేసెద వేల నయ్యా! నీ
వెనుకనె వత్తుఁ గాని యరవిందదళాక్షుఁడు తప్పు లేని దే
నను విడ నాడి మారనళినప్రదరంబులపాలు సేసి తాఁ
జనె నిఁక నేను వచ్చిన నసహ్యత నొందఁడె యప్పటంతకున్. ౧౧౩

నీవె పో వయ్య! పోయి "నానేర మేమి?
తప్పు లేనిదె మదనాగ్ని కొప్పగించి
చనితివే మాయదయ చాలు చాలు ననుచుఁ,
దోయజాలయ మిమ్ముఁ జాల దూఱె" ననుము! ౧౧౪

అని యివ్విధమునఁ బల్కిన,
జననాథుఁడు మ్రొక్కి లేచి శశ్వద్భక్తిన్

తే॥ గీ॥ పుండరీకాక్షి నాదండ నుండకున్నఁ
గాండజాతాస్త్రకాండప్రకాండములకు
బెండువడి గుండె సెదరక యుండు టెట్లు?
మండలాధీశ! యేది వేదండగమన? ౧౨౨

కం॥ అని యివ్విధమునఁ బలుకుచుఁ
దనరాకకు నెదురుసూచు తార్క్ష్యధ్వజుచెం
తను జేరి మ్రొక్కి యిట్లనె
వనజము చేఁ బట్టి రామవసుధాధిపుడున్ ౧౨౩

కం॥ దేవా! నీయాజ్ఞను జని
శ్రీవనితను జూచి నీవు సెప్పినయట్లా
దేవికి సంగర మొసఁచు
రావమ్మా! 'నీవిభుండు రమ్మనియె' ననన్ ౧౨౪

కం॥ మనమునఁ దన్ను విడిచి చనె
ననుఖేదము, పిలువఁ బనిచె ననుమోదము, రెం
డును బెనఁగొన వనజేక్షణ
కనుఁగవ నులివెచ్చనీరు గ్రమ్మఁగ ననియెన్. ౧౨౫

శా॥ అయ్యో! బూటక మేల? శౌరి నను రమ్మన్నాఁడే! నేఁ జెల్లఁ బో;
నయ్యో! యెక్కడిజోలి; నీ వెవరో! యీయాశ్చర్య మే మందుఁ; దా
నయ్యో! నాయెడఁ గోపగించి దయ రవ్వంతైన లేకప్పుడే
యియ్యారణ్యముపాలు సేసి చని నేఁ డేలాగు నన్ రమ్మనెన్ ౧౨౬

కం॥ తలిదండ్రులనా! యెఱుఁగఁడు,
కులగోత్రముఁ దెలియఁ డతఁడు, గుణహీనుం డై

చలపోరి పుణ్యజనముల
బలిమిని విధియించుఁ గఠినపాకియు మఱియున్. ౧౨౭

మేనమా' మని యించుకైన లో నెంచక
కంసభూపాలుని హింస సేసె;
స్త్రీ, బాల, యనియెడుచింత యింతయు లేక
తాటకగాత్రంబుఁ దఱిఁగి వేసెఁ;
వనపాదభక్తిసంతతపారవశ్యుఁ డౌ
ప్రహ్లాదుతండ్రిరూపంబు మాపె;
బాలకుం డని మది భావించి చన్నీయఁ
బోయినపూతనప్రాలు పడంచె;
గీ॥ బిచ్చ మడిగిన లే దన కిచ్చె బలియు
నతనిఁ బాతాళగతముగా నణఁగఁ ద్రొక్కె;
నింతనిర్మోహదేవున కేలఁ గరుణ
గల్గు నామీఁద నిది వింత గాక! యనుచు. ౧౨

గీ॥ చంద్రబింబాఽస్య నిను జాల చాల దూఱి
"రాను బొమ్మిఁకఁ దనచేతిరవ్వ కోర్వఁ
జాల; హరిపొందు చాలింకఁ జాలు" ననుచు
నజ్జ మిచ్చెను మీకిమ్మటంచు నిదుగో! ౧౨

॥ అనినన్ బంచశరమ్ము లొక్కమొగి నిష్ఠ్వాసంబునన్ గూర్చి మ
జ్జననీ బాసితి పంచు మూరుఁడు మనస్తాపంబుతో నేసినన్.
వనజాతాక్షుహృదబ్జమున్ దగుల సర్వజ్ఞుండు నై మూర్ఛఁ జెం
దినచందంబున దివ్యశయ్య నపుడున్ దేహంబుఁ దాఁ జేర్చుచున్. ౧౩౦

ఉ॥ హా! యని కన్ను మూయు; సహాహా! యని నవ్వు, నిఁ కెట్లు సేతు న
యొయ్యో! యని మోము వంచు; మన సోర్వదహో! యని చింత నొందు;నా
హా! యని వేగ లేచుఁ; జెలియా! యని దిక్కులు సూచు; వేగ రా
వే! యని పిల్చు; నుస్సు రను; వేసరుఁ;దా శయనించుఁ జాన్పునన్. ౧౩౧

కం॥ హరి యివ్విధమునఁ గేవల
నరుచందము వెతల నంది సరనాథునిచే
సరసీరుహమున్ గైకొని
కర మరుదుగ నిట్లు వల్కెఁ గమలముతోడన్. ౧౩౨

సీ॥ దర్పకోద్దండదోర్దండమండితకాండ!
కాండరుడ్జాండాఽదికారణంబ!
తతమోదయుతవిరాజితమహోన్నతహంస!
హంసోదరైకరిరంసహృదయ!
భవశిరోభవధునీభవనవాంబుజరాజ!
రాజానుజాతాతిరమ్యధామ!
మధురసన్మధురసోన్మదయుక్తబంభర
భరణ! విభ్రాజితభర్మగర్భ!

తే॥ గీ॥ శారదా, శార, శరదభ్ర, చంద్ర, చంద్ర,
చంద్రికా, సాంద్రచంద్రోప, లేంద్రసామ
జేంద్ర, నిస్తంద్రభుజగరాజేంద్రదేహ!
లసదమితశుభ్రదేహోపహాసనధామ! ౧౩

కం॥ కమలాంకవదనకాతర
కమలాక్షినిభాక్షివిమలకమలాఽలయశ్రీ

కమలకు శుభమే కద! యో
కమలాన్వయకమలరాశికమలవిరోధీ! ౧౩౪

మ॥ రమ నీయందు జనించినందువలనన్ రంజిల్లు నీపోలికల్
విమలాऽస్యాక్షికరాంఘ్రియుగ్మములు భావింపంగ నాకన్నులన్
గమలాదేవినిఁ జూచినట్ల యగు ని న్గన్గొన్న నిక్కంబు సం
భ్రమ మందెన్ జుమి! నాహృదబ్జ మిపు డో రాజీవరాజేశ్వరా! ౧౩౫

కం॥ చక్రాంగప్రియమవు గద!
చక్రాంకుఁడ నుమ్మి! నేను సరసీరుహాభూ
చక్రాధిప! నన్నా శ్రీ
చక్రస్తనిఁ గూర్చి ప్రియము సల్పం గదవే! ౧౩౬

కం॥ అని వనజము నివ్విధమున
వినుతించి మురాసురారి వేసరి చింతా
వననిధినిమగ్నచేతో
వనజుం డై రాజువదనవనజముఁ జూచెన్. ౧౩౭

ఆశ్వాసాంతము.

మ॥ రవివంశార్ణవసోమ! సోమసవభుగ్రాజాబ్జభూమస్కారి
స్తవనీయోజ్జ్వలపాద! పాదతలయోషాభూతపాషాణ! మా
నివరాంభోరుహపాణి! పాణిధృతనిర్ణిద్రామర ద్వేషి! రా
జవిదారోద్ధతపత్త్రి! పత్త్రివరరాజత్సైంధవాऽరోహణా! ౧౩౮

ఉత్సాహ॥ ఖరసురారివరవిదార! కలితసార కాంచనో
త్కరనిశారదశశతారదరకరారవింద! సా
గరగభీర! నగసుధీర! ఘనవిసార కేతుసుం
దరశరీర! హారశారదసదళనశూర! భూవరా! ౧౩౯

గద్య.

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాస్వాదనతుందిలేందింది
రాయమానమానసతూముపంశక్షీరపారావారరాకాసు
ధాకరరామక్ష్మాపాలసుపుత్రపవిత్రచరిత్రక్షీణాం
ధ్రగీర్వాణచణరామచంద్రావనీపాలవిరచిత
శ్రీమదలమేల్మంగాపరిణయం బనుమహా
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వా
సము సంపూర్ణము.

ఓం

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీకోసలరాట్తనయా
లోకనవికచాబ్జ! శోకలోచన! విలస
త్ప్రాకాహితలోకాహిత
లోకాహితఖగేంద్ర! సకలలోకనరేంద్ర! ౧

తే॥ గీ॥ అవధరింపుము! యాటమీద నజ్జవకాళి
యేమి సెప్పెను! సురసంయమీశ్వరునకు;
వినఁగ నవి మాకు వివరింపు విస్తృతముగ
సూత! సముపేతహరికథాఖ్యాతచరిత! ౨

కం॥ అన సూతుఁడు శౌనకముఖ
మునికులతిలకులను గాంచి ముదితాత్ముండై
"వనజోదరుదివ్యకథల్
విన వలసితిరేని మీరు వినుఁ"డని పలికెన్. ౩

ఉ॥ రామధరాధినాయకుని రాజనిభాస్యముఁ జూచి శౌరి "నేఁ
బాముల బట్టెదన్, జ్వాలను బట్టెద, నంగజు నైనఁ గొట్టెదన్,
భామరో! నిన్ను బాయ నని బాసలు సేసెద నంటి" నంచు నా
శ్యామకుఁ జెప్పి పిల్వు మొకసారిక వేఁడెద నిన్ను భూవరా!

మత్తకోకిల॥ అనుచు నానతి యిచ్చినన్ సిటలార్పితాంజలిబంధుఁడై
మనుజనాయకుఁ డిట్లు వల్కె నమందవాగ్విభవంబునన్

దనుజమర్దన! యివ్విధంబున దాసునిన్ బ్రీతిమాలఁగాఁ
జనునె? నీ విపు డాన తిచ్చిన సత్వరంబున నేగెదన్. ౫

కం॥ మీయాజ్ఞోల్లంఘనమును
జేయఁగ నే నెంతవాఁడ శ్రీవర! మును నేఁ
బోయిన రా ననెఁ గద! "వేం
చేయఁగవలె మీ రె యటకు శీఘ్రం" బనినన్. ౬

మ॥ హసనాంచన్ముఖుఁ డౌచు దైత్యమథనుం డాహ్లాది యై యిట్లు నే
నసమాస్త్రాంబకుబాధ కోర్వక నితాంతాసక్తి మై వత్తునే
నసమానోజ్జ్వలబుద్ధిధుర్య! విన వయ్యా! యీధరామండలిన్
రసికుల్ విన్నను రామ రామ! సగరా! రామావనీపాలకా!

కం॥ అటు గనుక నీవె చని యా
కుటిలాలకతో "మహోగ్రకుసుమాయుధదు
ర్ఘటపటుశరపీడితహృ
త్పుట మిఁక నెటు లౌనో? చూచి పొమ్మనె"ననుమా!

చ॥ అనిన నమస్కరించి దరహాసమనోజ్ఞముఖారవిందుఁ డై
చనియె నదభ్రవేగజితసౌరభవాహుఁడు నై ముదంబుతో
జనవరుఁ డచ్యుతాంఘ్రియుగసారసభక్తినియుక్తనైజహృ
ద్వనజవికాస మొంద వనవాటికి నిందిర యున్నచోటికిన్.

ఉ॥ పోయి సరోజమందిరకు భూవరుఁ డచ్యుతపాదనిశ్చల
స్థాయదనార్తతోత్కలితభక్తిహృదబ్జుఁడు మ్రొక్కినన్; హరి

ఏ గారవించుచు "సరీసృపవైరితురంగుఁ డే మనెన్?
ే నల్గినాఁడో? కరుణాపరుఁడై నను బిల్వ నంపెనో? ౧౦

స నఘ మనుచును బుధ
ప లను చుండ వినవె! జననాయక! మీా
గురుం డే మనెనో?
క నాతోడఁ దెల్పి పుణ్యముఁ గనుమా!" ౧౧

ని జననీ! నీ విటు
దగునా! దాసజనుని; నచ్యుతునావే
మే మని చెప్పుదు? "రా
ందిర"యనిన మూర్ఛ నప్పుడె చెందెన్. ౧౨

మూర్ఛఁ దేరి నరకాంతకుఁ డల్లన జేతులన్ ధరా
పర్యిణ ఘటించి తనుకంపము నొందఁగ లేచి "యింక నే
ం నోర్తుఁ గంతుచిశితేషుభీతానినితాంతతాపసం
తప్తహృదబ్జ? మెట్లొ దయ గల్గినఁ గన్నులఁ జూచి పొ"మ్మనెన్ ౧౩

ముగ నేఁటినుండి యిఁక ని న్నెడఁ బాయను నమ్ము"మంచునా
ననాలలామకును గట్టిగఁ దెల్పుము; "నమ్మకున్నఁ బు
చయఘ్నకిల్బిషము నందెద"నం చను; మిందు కానతీ
ణి గొనుప్పకున్న "వనవాసము వ్రాసిన"దంచుఁ బల్కుమా! ౧౪

మటియు ని ట్లనిరెను. ౧౫

నక్క మీానాట మాయమ్మ! నీవిభుండు
వు రాకున్న నిమిషంబు నిల్వఁ డచట

వచ్చు నీచెంత కిప్పుడె మచ్చెకంటి!
జాగు సేయక రావమ్మ! వేగముగను. ౧౬

కం॥ అన విని "పుణ్యజనంబులు"
ననఁగా విను యాతుధాను లయ్య! నృపాలా!
"వన" మనఁగా నుదకంబును;
హానననివాసముల కతని కవి యోగ్యము లే ౧౭

కం॥ "మాధవుఁ" డనునామము మా
యాధవుఁ డై యునికిచేత నన వలసెఁ జుమీ!
యీధారుణి వేధస్సుమ
మేధానిధు లతనిమాయ మించఁగ గలరే! ౧౮

చ॥ ఇతరజనవ్రజంబు ధరణీశ్వరచంద్ర! "దరాదిశోభితా
యతకరిరాట్కరోపమభుజార్గళభూరితరప్రతాపని
ర్జితమహితామరాహితవరేణ్యుఁ" డనంగఁ బ్రసిద్ధుఁ డైనయ
చ్యుతుఘనమాయ దాఁటుటకుఁ జోద్యము గాదఁటె! యెన్నిభంగులన్
౧౯

తే॥ గీ॥ రామభూమీశ! హరిమాయ లేమి సెప్ప
నద్భుతంబులు; "సర్వజ్ఞు లైనయట్టి
మునుల నెల్లర మోహితాత్ములుగఁ జేసె"
నన్న నెవ్వారివశ మగు నన్న! యానిన. ౨౦

కం॥ లే దమ్మా! "హరి మిథ్యా
వాదుండును గాఁడు, సత్యవాక్యుం" డనుచున్

వేదంబులు వలుకును; మీ
పాదంబులతోడు పిలువఁ బనిచెను నిన్నున్. ౨౧

మ॥ నను జాలన్ బ్రియవాక్కులన్ బిలిచి శ్రీనాథుండు "నాయన్న! నా
వనితన్ దోడుక రమ్ము పొ" మ్మనిన నవ్వా! వచ్చితిన్, నీవు "రా"
ననుచున్ నన్ను నిరాకరించినను నే నచ్చోటికేచందమున్
జనుదున్? "నన్ దయఁ జూచి ర" మ్మని నమస్కారంబుఁ గావించినన్ ౨౨

మ॥ శతపత్రాంచితపత్రలోచనము లాక్ష్మాజానిపై నిల్పి యో
క్షితినాథేశ్వర! నీమనోదృఢత, నీశీలంబుచే, నీమహా
ద్భుతనిశ్చంచలభక్తి, మెచ్చితిని; నీతోఁ గూడ నే వత్తు; న
చ్యుతుఁ డే మన్నను నీదె భారము సుమీ! క్షోణీసతీసాక్షి గాన్ ౨౩

కం॥ అని లేచి దిగ్గుమని యా
వనజాలయ చెలులు రామవసుధాధిపుఁడున్
దనవెంబడి రాఁగను సం
జనశైలారోహణంబు సల్పఁగఁ దొడఁగెన్.

సీ॥ సెలయేటినీటిలోపల మోముఁ గని యుత్ప
లాంచితాబ్జం బని యందఁ బోవు;
మగజాల నూగారుజిగినీడ గన్పింపఁ
గాలాహి యని చాలఁ గలువడించుఁ;
గలువరాచలువపమెట్టులఁ దోఁచుపదరక్తి
మము కోకనదము లన్ భ్రమ వహించుఁ;

దతసానుగత మైనతములతాద్యుతిఁ గాంచి
హైరణ్యభూధరం బని తలంచు;
తే॥ గీ॥ నిందిరాకాంత హృదయేశసుందరాంఘ్రి
జలరుహార్పితనై జనుస్వాంత గాన
ముగ్ధచందానఁ దనతనూస్నిగ్ధరుచులు
దెలియఁ జాలక చనియెఁ గుత్కీల మెక్కి. ౨౫

సీ॥ కంఠీరవసమీపఘనసారతలువుల
నలరుచుండెడిమహాకలభములను,
గాంచనసానునికటాంచితాబ్జములమీఁదఁ
జెలరేఁగి విహరించునలికులముల,
సాంకవపరిమళాఽఽసన్నచంచద్బింబ
ఫలము లాసించెడిచిలుకగముల,
వల్మీకనిర్గతవ్యాళోగ్రభోగాగ్ర
ములఁ జెరించెడికోకములగణంబు,
తే॥ గీ॥ నచలమునఁ జూచి చనుచుండునటులనుండు
నడుము, తొడలును, నడుపంద, మడలుముక్కు,
వదన, మలకలు, గంధంబు, పెదవి, పల్కు,
నాభి, నూగారు, కుచములు శోభిలంగ. ౨౬

కం॥ ఇవ్విధమున నృపుతో నా
జవ్వని యచలంబుపైకిఁ జనుదెంచునెడన్.
దవ్వులఁ గని ముసిముసినగు
[illegible]వు హర్షించుచుండె నగధరుఁ డంతన్. ౨౭

సీ॥ ఇందిరాలపనారవిందంబు సెలఁగె గో
విందదృగ్రవిభానువితతిఁ జూచి;
కమలాసతీనేత్రకుముదముల్ వికసించె
స్వామిసుందరవక్త్రసోముఁ జూచి;
క్షీరాబ్ధిజావచఃకీర మానందించె
మాధవాధరబింబమహిమఁ జూచి;
శ్రీతరుణీమనశ్చాతకం బలరె శ్రీ
హరిదివ్యతనువారిధరముఁ జూచి;
తే॥ గీ॥ యీడు లేనట్టిమహాయనీడజార్వ
జడధికన్యలు సంతోషపడుటఁ జూడఁ
బుడమిఁ జేఁడైనరాముఁడు పూర్వజన్మ
మునఁ దపం బేమి సేసెనో! మునివరేణ్య! ౨౮

కం॥ నారద! యీరీతిగ శ్రీ
నీరదనిభవేణి వోయి నీరజనాభున్
జేరి దరస్మితముఖవర
సారస మలరంగ మ్రొక్కె సదమలభక్తిన్.

ఉ॥ నీజనకుండు, నీసుతుఁడు, నీయనుజన్ముఁడు, నీవు నెప్పుడున్
రాజితజీవనంబు నభిరామమహోజ్జ్వలసుందరత్వమున్
భ్రాజిత మానసువ్రజము భాసురసంపదలెల్లఁ గల్గుచున్
దేజము నొందుమీ! యనుచు దీవన లిచ్చె సరోజనాభుఁడున్. ౩౦

కం॥ సదయుం డై కరముల నా
మదవతి లేవంగ నెత్తి మందస్మితస

ద్వదనాంభోజాతంబునఁ
గుదినగోనఁగాఁ గౌఁగిలించుకొనినన్ రమయున్. 3౧

ఉ|| దేవ! మహానుభావ! నతదీనజనావళిఁ బ్రోవ దైవమే
నీవు గదా! యటంచుఁ గృతనిశ్చయ నై కలుషాత్ము లౌచు నీ
సేవ లెఱుంగనట్టియవిశిష్టజనంబుల నెల్ల సత్కృపన్
గావవె!యన్న మాత్రమున నాయెడఁ గన్నడ సేయ న్యాయమా. 3౨

కం|| నీమనసు రాక యుండిన
భామిని! యిది గూడ దనుచుఁ బల్కిన వినవే
నామీఁదఁ గోపగించుచు
స్వామీ! న న్నొంటి విడిచి చనఁగాఁ దగునే; 33

ఉ|| దుర్గమశైలసంయుతము దుస్తరభూరిగభీరనిమ్నగా
వర్గనిరర్గళోగ్రమృగవారవిహారభయంకరంబు నౌ
మార్గముఁ బట్టి వచ్చి యసమానగిరీంద్రముఁ జూచి యానగాం
తర్లోకంబునాంతరమునన్ విభుఁ డుండు నటంచు నమ్ముచున్. 3౪

సీ|| ఆమహాపర్వతసమీపభూమి నొక్క
కమలకహ్లారకైరవకలిత మైన
విమలకమలాకరముఁ గాంచి ప్రమద మెసఁగ
నచట నుండఁగ సర్వంసహావిభుండు. 3౫

కరుణ దలిర్ప వచ్చి నను గాంచి నమస్కృతి సేసి "యమ్మరో!
౨ నిను బిల్వఁ బంపె" నని సాంజలి యై నను వేఁడ వచ్చితిన్;

బరమపవిత్రుఁ డీనృపునివల్లనె కాదె!భవత్పదాబ్జముల్
సరసిజనాభ! చూచితిని; సంతస మందితి వంత బాసితిన్ 3౬

చ॥ అని విని కేశవుండు "తరుణాబ్జదలాక్షి! కృపాఽత్తచిత్త వై
ఘనకలుషాఽత్మ లైనజనకాండముఁ బ్రోవు" మటంచు వేఁడినన్
మనమున లేనికోప మొకమాటకుఁ గల్పన సేసి వచ్చినాఁ
డను సుమి!నీయభీష్టముఁ దటాలునఁ దీర్ప నృపాలుపాలికిన్ 3౭

కం॥ ఏలా!యంచును శశినిభ
ఫాలా!మది జాలి మాలి పడకయు వినుమా!
జోలిని వినఁగా నిది కడు
మే లాయె నటంచు నన్ను మెచ్చవె!బాలా 3౮

సీ॥ భక్తుఁ డై,వరతపోయుక్తుఁ డై,సంసార
ముక్తుఁ డై,మత్పదాఽసక్తుఁడైన;
విహితుఁ డై,ఘనదానసహితుఁ డై,నిజయశో
మహితుఁ డై, కిల్బిషరహితుఁ డైన;
పూర్ణుఁ డై,గుణగణోదీర్ణుఁ డై, విద్యావి
కీర్ణుఁ డై, జ్ఞానవిస్తీర్ణుఁ డైన;
శాంతుఁ డై, మత్పరస్వాంతుఁడై, వినయవి
శ్రాంతుఁ డై, సద్ఘృణాఽక్రాంతుఁ డైన;

తే॥ గీ॥ యీరసాఽధీశకేసరిభూరిమహిమ
మెచ్చి వచ్చితి నిచ్చటి కిచ్చ పుట్టి;
యింక మన మిందు నుండినఁ బంకయ
జనులు సేవించి ముక్తికిఁ జనుదు రబల 3౯

వ॥ అనిన ముదితాంతరంగ యై శ్రీదేవి యచ్యుతున కిట్లనియె. ౪౦

కం॥ శ్రీహరి! యీమాటకు సం
దేహము! యీరామనృపతిదివ్యతరగుణ
వ్యూహము లభిరామంబుల్
మాహాత్మ్యము గల్గునితని మన్నింపు తగన్ ౪౧

చ॥ అన విని శౌరి రామవసుధాఽధిపుమీఁదఁ గృపాకటాక్షసం
జనితసుధారసంబు నెగఁ జల్లి "రసాఽధిప! నీదుకోర్కె ని
త్తును దగ వేడు" మన్న, నతితుచ్ఛమనోరథ మేల నాకు? నో
యనఘచరిత్ర! నీశుభపదాంబుజముల్ గనుఁగొంటిఁ జాలదే ౪.

ఉ॥ ఐన మదీయహృద్వనజమం దొకకోరిక యుండె; నిచ్చి స
న్మానుని జేసితేని బహుమాన మి దెవ్వరి? దయ్య! నీదెకా!
దీనశరణ్య! యంచు నతిదీనత వేఁడిన శౌరి సూచి యో
మానవనాథ! వేఁడు మనుమాన మిఁ కేటికి? నిత్తు నిక్కముగ్

వ॥ అనిన

కం॥ సన్నుతి సేసెద రమయును
బన్నగవరశయన! నీవుఁ బరిణయ మైనన్
గన్నులఁ జూడఁగ వేడుక
యున్నది నను గరుణఁ జూచి యొప్పవె! యనినన్

కం॥ బాలక! యీమదరోలం
బాలకయును నేనుఁ బరిణయం బాడినచో

నీలోకము మన్నిజరూ
పాలోకము సేయుటకును నర్హమె! చెపుమా! ౪౬

క౦॥ మనసునఁ గొద వేటికి? యిది
విని యాహ్లాదంబు నొందు వివరించెద; నీ
ఘనతర మగుచారిత్రం
బనఘం బై యొప్పుచున్న దది యెట్లన్నన్. ౭౪

సీ॥ అగణితపాంచరాత్రాగమంబునఁ గల
యర్థంబుఁ జెప్పెదఁ బార్థివేంద్ర!,
యస్మదర్చావిగ్రహంబులు నాలుగు
విధము లై యుండును బ్రథితముగను,
'నవి యెవ్వి' యన "స్వయంవ్యక్తంబు, దివ్యంబు;
సైద్ధంబు, మఱి మానుషంబు" ననఁగ,
నందు 'స్వయంవ్యక్త' మది మానిజవ్యక్తి;
యది దక్క నితరంబు లవనియందు

ఆ॥ వె॥ దివిజసిద్ధమనుజనివహంబు లెలమితో
దారు, జాతరూప, తామ్ర, రౌప్య,
శిలల నస్మదీయలలితవిగ్రహరూప
ముల నొనర్చి ముక్తిఫలముఁ గనిరి

క౦ శిల్పిగణముఁ బిల్పించి య
నల్పార్చావిగ్రహముల నతివిమలముగాఁ
గల్పింపఁ జేసి నీసం
కల్పం బీడేర్చుకొనుము! కడుమోదమునన్ ౪౯

చ॥ అన విని సంతసించి యచలాఽధిపవర్యుఁడు వాసుదేవ! నేఁ
జనియెద నాజ్ఞ యి మ్మనుచు సాగిలి మ్రొక్కినఁ బ్రీతితోడ నా
వనరుహనాభుఁ డాతనిని "వైళముగా నిజరాజధానికిన్
జని భవదిష్ట మేము? యది సాంగముగా నొనరించు"మం చనెన్. ౫౦

వ॥ ఇట్లు భగవదాజ్ఞఁ గొని, ౫౧

కం॥ మానవవర్యుఁడు భక్తిఁ
బౌనఃపున్యప్రణామపరికలితుం డై
యానవినిర్జితఘనపవ
మానుం డై వేగ దిగియె మంజులనగమున్. ౫౨

కం॥ మును దా నచ్చట నిలిపిన
ఘనతరచతురంగబలముఁ గై కొని పురికిన్
జనియె, వనమాలితోఁ గడ
చినిముచ్చట నాప్తతతికిఁ జెప్పుచుఁ బిదపన్ ౫౩

కం॥ తిరుకల్యాణమహోత్సవ
పరికరముల నెల్లఁ గూర్చి పరిశుద్ధులు నౌ
వరపాంచరాత్రవేత్తలఁ
బరమాఽహ్లాదమునఁ బిలువఁ బనిచి ముదమునన్. ౫౪

కం॥ "బహునాళ్లకు వచ్చితి" రని
బహుమానపురస్సరముగఁ బార్థివుఁడు దయా
సహితుం డై మణిభూషణ
సహితులఁ గావించి వారు సంతస మొందన్. ౫౫

క॥ హారితిరుకల్యాణోత్సవ
మిర వొందఁగ మాకుఁ జూడ నిచ్ఛ జనించెన్;
బరమాప్తులు మీరలు మముఁ
గరుణించి మహాత్ములార! కావింపఁ దగున్ ౫౬

వ॥ అనిన విని యప్పాంచరాత్రాగమవేత్త లగుభూసురోత్తము లత్యంతసంభ్రమాయత్తచిత్తులై, లలితవాక్యంబులఁ దజ్జలనిధిమేఖలాధిపసలలితముఖసలిలజం బాలోకించి, "భవదీయపూర్వకృతాగణ్యపుణ్యప్రభావసంపన్న శ్రీమన్నారాయణకారుణ్యకటాక్షలబ్ధప్రావీణ్యనైపుణ్యంబున నేతత్పుణ్యకార్యకర్తృత్వేచ్ఛ నీమనంబున నుదయించె; నొరుల కేల సంభవించు నిక్కార్యం? బఖర్వసుపర్వాధిపున కైన నంద రాని నిర్వాణరాజధాని చేరువ యై యుండుఁ, గావున నవశ్యం బాచరింపవలయు" నని యాన తిచ్చిన; నృపాలోత్తంసుం డనల్పజ్ఞానాధికు లైన శిల్పకారులఁ బిల్పించి, సముచితకాంచనతామ్రమేళనంబుఁ గావించి, శ్రీభూనీళాసహితంబుగా 'శ్రీనివా'సాభిధానవిగ్రహంబును విభాసుః పరిభాసింహాసనచ్ఛత్రచామరాద్యనేకమణిగణాగణితభూషణసహితంబుగా జగన్మోహనాకారంబుతోఁ గల్పించి, శశికాంతోపలాంతరాళశుకనాసికాముఖమంటపయాగశాలాద్యనేకమం[illegible]ప్రాకారంబులన్ గావించి యనంతరంబు:— ౫౭

క॥ స్యందనవిలసద్వినతా
నందనముఖవిమలవాహనంబుల నెల్లన్
సుందరముగఁ గల్పించి య
మందానందంబు నృపతి మదిలో నొందెన్. ౫౮

కం॥ కార్తాంతికవర్యుల సుము
హూర్తం బడుగంగ వార లుత్సాహముతో
నార్తజనవ్రాతావన!
కీర్తిమహోదార! యనుచుఁ గీర్తించి వెసన్ ౫౯

కం॥ పంచకరహితం బై, గ్రహ
సంచయము త్రికోణకేంద్రసంయుక్తం బై,
ప్రాంచజ్ఝషలగ్నంబున
నెంచఁగ రవి పదునొకండునింటఁ జెలంగన్ ౬౦

కం॥ అంచితతిథివారర్క్షో
దంచద్యోగకరణములు నలరుచు నుండన్
బంచాంగశుద్ధిగా నొక
మంచిముహూర్తంబు గలదు మనుజాధీశా! ౬౧

తే॥గీ॥ విన్నవించెద మాలగ్న మెన్నఁ డనిన
ఘనతరం బగుశిశిరర్తువునఁ జెలంగు
మాఘశుద్ధత్రయోదశీమందవార
మమితయోగ్యంబు నై యున్న దనిన నృపతి. ౬౨

ఉ॥ బంగరుకాగిదంబుల నృపాలకజాలముపేర "నిస్తులా
భంగశతాంగదంతిభటవా సమన్వితు లౌచు మీరు సా
రంగవరప్రదాయియభిరామవివాహమహోత్సవంబుఁ జూ
డం గడువేడ్కతోడుతఁ దటాలున రం" డని వ్రాసి పంపినన్ ౬

కం॥ శిరమున నిడుకొని మదిలోఁ
బరమానందంబు నొంది పార్థివనివహం
బురుతరసత్వరగతితోఁ
గరితురగపదాతిరథనికాయాన్వితు లై, ౬౪

ఉ॥ సింధురబృంహితంబులు, విశేషరథాంగరవంబు; లుల్లస
త్సైంధవహేషితంబులు, పదాతిజనోన్నతసింహనాదముల్,
బంధుర మై చెలంగ నతిభాసురలీలల వచ్చి రందఱున్
గంధరసైంధవాదిసురకాండము విస్మయ మంది చూడఁగన్ ౬౫

వ॥ అప్పుడు. ౬౬

కం॥ ఋత్విగ్గణవిపులాగము
నాత్వ్రతచణబుధులఁ బిల్చి క్ష్మాపతివరుఁడున్
సత్వరమున ధీసంప
న్నత్వంబున నంకురార్పణముఁ జేయించెన్

మ॥ మఱునాఁ డుష్ణగభస్తి పూర్వనగరాశ్యాళిన్ బ్రవేశింపఁగా
వరసంధ్యాజపహోమకృత్యముల నిర్వర్తించి భూదేవతల్
పరమోత్సాహముతో ఖగేశ్వరునిరూపం బంబరంబందు సుం
దర మొప్పన్ లిఖియించి చేసిరి మహోద్దామధ్వజారోహముల్ ౬

శా॥ భేరీతాడనపూర్వ మానిసిని భూభృద్భిన్నమఖద్యోచర
ద్వారాహ్వానము సేసి; రప్పుడు సురవ్రాతంబు భీతిల్లి "యీ
భేరీధ్వాన మి దేల పుట్టె" హరి దాఁ బేర్వేర దేవాళిన్
'రా ర మ్మం' చన హేతు వేమి? మనపై రానేమొ కాయం చనన్.

కం॥ ఆరేయి తెల్లవారిన
శ్రీరమణున కర్పితముగ క్షితిపతి విమల
స్ఫారాంచితషడ్రసయుత
సారాన్నం బిడియె నగ్రజన్ముల కెల్లన్ ౨౦

కం॥ ఆనాఁటిరాత్రి గడచిన
భానుం డుదయంబు నంద బాడబులను స
న్మానించి వారిఁ గనుఁగొని
మానవనాథుండు వలికె మంజులఫణితిన్ ౨

ఉ॥ భూసురవర్యులార! నరభోజనసైరివివాహలగ్న మీ
వాసరమందె యానుగద! వైళమ మీరలు నిత్యకృత్యముల్
సేసి సభక్తిచిత్తులయి శీఘ్రముగా మఱి దేవపూజలున్
జేసుక పుష్కరాంచితవిశేషముహూర్తము దప్పకుండఁగాన్ ౨

కం॥ రమకున్ శ్రీమద్వేంకట
రమణునకును బరిణయంబు రాజితమతులై
భ్రమఁ జెందక సుముహూర్తం
బమలముగాఁ జూచి చేయుఁ డని యాటమీఁదన్.

మ॥ వినతానందనవాహనంబుపయి నావిశ్వేశుఁ డైనట్టిశ్రీ
వనితానాథుని రామభూవిభుఁడు చెల్వం బొప్ప వేంచేయఁ జే
సిన నొప్పెన్; గనకాచలేంద్రవిలసచ్ఛృంగాగ్రమందున్ విక
ర్తనుఁ డావిర్భవు మైనచందమున విభ్రాజత్ప్రభాభూతిచేన్.

మ॥ తిరువీదిన్ జనుచుండఁగా నప్పుడు సాధ్వీరత్నముల్ భక్తిచే
వరనీరాజనపాణిపద్మ లగుచున్ బ్రహ్లాదముల్ మీఱ శ్రీ
హరిపైఁ బాడిరి మంగళారతులు నవ్యాఽమోదమాకందపు
ష్పరసాఽస్వాదసతుందిలాళివిలసజ్ఝంకారనాదంబులన్ ౨౫

శా॥ మింటన్ జంటలు గట్టి దేవతలు స్వామిన్ జూత మన్వేడ్క వా
ల్గంటుల్ దంటగ వెంటనంటుకొని రాఁగా నిల్చి సద్భక్తితోఁ
గంటన్ ఱెప్పల నంట నీక ఖగరాట్స్కంధాగ్రసంబాధుఁ డై
యుంటన్ జూచిరి కంటకాసురవిదారోదగ్రదోర్దండునిన్ ౨౬

సీ॥ నరకరక్షోరాజనిరసనంబును జేసి
ధరణిభారముఁ బాఁప నరుగునపుడు;
సురలకై మంథానధరణీధరోద్ధార
మును జేయఁ గృపతోడఁ జనినయపుడు
సాత్రాజితీశతపత్రనేత్రకై దేవ
భూజంబుఁ గొని రాను బోయినపుడు;
గర్వాతిదుర్వారపూర్వగీర్వాణాళి
నెల్ల హింసింపఁగా నేగినపుడు;

తే॥ గీ॥ పూర్వకథలను క్షితిరాట్సార్వభౌమ
వాహనాఽరూఢుఁ డయ్యె నవ్వనరుహాక్షుఁ
డనుచు వినుచుందు మెప్పు; డీదినమునందు
మనము గన్నులఁ జూచితి మనుచు జనులు. ౨౭

క॥ అతికుతుకాన్వితు లై శ్రీ
పతిపదపంకజయుగంబు భాసురభక్తిన్
దతమతియుతు లై సురసం
తతిరీతిని ఱెప్ప లిడక తప్పక చూడన్. ౭౮

క॥ తిరువీదిన్ జని శ్రీహరి
తిరుగన్ జనుదేర భూమిదేవాన్వితుఁ డై
నరనాథుఁడు హితనరవర
పరివృతుఁ డై యెదురుకొనఁగ భాస్వద్భక్తిన్. ౭౯

మ॥ స్ఫురదష్టాపదదివ్యరత్నరుచులన్ భూమ్యంతరిక్షాష్టది
గ్స్ఫురితం బై తగుచప్పరమునన్ బాథోధిరాజన్యకూఁ
తురు నందంబుగ నుంచి వీథిఁ జనుచున్ దోరంబునన్ వచ్చుశ్రీ
హరిఁగన్గొంచు నదభ్రసంభ్రమమనీషాఽఽయత్తు లై పేడుకన్. ౮

క॥ "మీ రెవ్వ? రిచ్చటికి రాఁ
గారణ మది యేమి? జలధి కన్యామణి యీ
దారినిఁ దిరువీదికిఁ జను;
దారిని నిలువక యె మీరు దలఁగుఁ" డటన్నన్ ౮

వ॥ భగవద్దాసు లిట్లనిరి. ౮.

మ॥ తలఁగంగా నిటు వచ్చినార మొ? సుధాధామానుజాతాంబురు
ట్విలసన్నేత్రినిఁ బెండ్లి యాడుటకు నై వేంచేసినాఁ డంజనా
చలశృంగాగ్రగుహావిహారుఁడు గనచ్ఛ్రీకాబ్జదోర్ధాముఁడున్
జలజారాతిహితేక్షణుండు; త్రిజగత్స్వామిన్ దగన్ జూడుఁడీ. ౮

ఉ॥ చూచినవారిపుణ్యమును జూచెద మంచనువారిభాగ్యముల్
జూచినవారిరూపములుఁ జూచినవారలకీర్తిసంపదల్
లోచనకర్ణరాడనలలోచను లబ్జభవుండు నాజగ
ల్లోచనుఁడుల్ ద్విపంచశతలోచనుఁడైన నుతింప శక్తులే; ౧౪

కం॥ అది గనుక మీరె శ్రీహరి
పదములసన్నిధికి వచ్చి భాసురభక్తిన్
విదితముగ మ్రొక్కి నిలిచిన
సదయుండై వచ్చు; నేమిసంశయ మనిరన్ ౧౫

వ॥ రమాదేవిభక్తవరు లిట్లనిరి. ౧౬

తే॥ గీ॥ కావలసి యున్న నాచిన్నికన్నెకడకు
వారె వత్తురు; మే మేల వత్తు మచటి?
కెపుడు లక్ష్మినిఁ జూతు మంచెదిరిచూచు
చుండి జాగేల? పిలుచుక రండు పొండు.

కం॥ అనినంతనె వారేటికిఁ
జనివడి వచ్చెదరు పెండ్లిప్రాయపుపడుచై
నను మీరె యెత్తుకొని మా
వనజోదరుకడకు నపుడు వచ్చెద రనుచున్

తే॥ గీ॥ ఉభయవాదులు నీరీతి నొకరి కొకరు
వేడుకకునగుఁ మాటల నాడికొనుచు
సమితసంతోషచిత్తులై యలరుచుండు
వేళఁ బలికిరి సిద్ధాంతవేదు లిట్లు

తే॥ గీ॥ లగ్న మొక రెండుగడియ లాలస్య మైన
లేదు; మాటలఁ బ్రొద్దు నీలీల జరుప
వలదు; రామనృపాలకవరునిఁ బూజ
సేసి తోడుక పోదము శీఘ్రమనిన. ౯౦

చ॥ పరిమళ మొప్పఁగందవొడి పాణితలంబునఁ బూని శౌరిపై
సరసిజపాణి మీన జనసంఘము సల్లెను; రామభూవరుం
డురుతరకాంచనాంచితమహోజ్జ్వలరాంకవ మొప్ప కేశవుఁ
మురజముఖాద్యవాద్యములు మ్రోయఁగఁ దోడుక వచ్చి వేడుకన్ ౯౧

మ॥ ఘనవాహోపలవేదికన్ వెలుఁగుచొక్కంబైన జాబిల్లిఱా
లను నిర్మించిన పెండ్లిపీఁటలను శ్రీలక్ష్మీన్ హృషీకేశులన్
వినయం బొప్పఁగఁ బాంచరాత్రవిధులన్ నేంచేయఁగాఁ జేసి భ
ర్మనపీనాంబర యుగ్మ మిచ్చి మధుపర్కంబున్ సమర్పించియున్ ౯౨

॥ రంగన్మణిగణఖచితా
భంగోత్తుంగైకభవ్యభర్మమయం బౌ
మంగళసూత్రము నలమే
ల్మంగకుఁ గట్టించి రపు డమందప్రీతిన్ ౯

తే॥ గీ॥ లలితలావణ్యముక్తాఫలంబులు దలఁ
బ్రాలు వోసినఁ గేశవపద్మపాణి
మూర్ధములఁ జూడ నొప్పెను, ముదముతోడ
సురలు మందారసుమవృష్టి గురిసి రనఁగ ౯

సీ॥ మంగళం బలమేలుమంగకు; మహితతు
రంగదభంగవిహంగునకును;
భృంగసన్నిభనీలశృంగారధమ్మిల్ల;
కంగజకోటిదివ్యాంగునకును;
గుందకోరకరదనేందువక్త్రికు, లస
త్సుందరక్షీరాబ్ధిమందిరునకు;
మందిరద్వికచారవిందకు; భాసురా
మందనిర్జరబృందవందితునకు;

తే॥ సీ॥ సనుచు మంగళారాత్రిక లమితభక్తిఁ
గంఠనిర్జితవిలసితాకుంఠనాద
కలితకలకంఠులై మహోత్కంఠ ఘణితి
లలితకంఠులు వాడిరి యలఁత లేక

కం॥ మఱునాఁ డరుణుఁడు వరుణుని
శరణంబును జొచ్చెఁ; నంత సంధ్యావేళన్
సరవరుఁ డానందముతోఁ
గరదీపసహస్రచయము ఘనముగ వెలుఁగన్

ఉ॥ అంబరచుంబితైకకలశాగ్రచిరత్నసురత్నకాంతితో
నంబరరత్నదీధితుల నావలఁ ద్రోయఁగఁ జాలునట్టిది
వ్యాంబరజాలసంకలితమై తనరారుప్రభాఒంతమందుఁ బీ
తాంబరధారి నిందిరను నందము నొందఁగఁ జేర్చి వేడుకన్

మ॥ తిరుపీదిన్ జనుచుండఁగా నపుడు విస్తీర్ణప్రభోదగుఁడై
యరుణుండున్ నిజసప్తసప్తిరథుఁడై యభ్రావరోహుండునై

ధరణీభాగముసఁ జరించు ననుచందం బొప్పె, భవ్యప్రభా
వరరుగ్వ్యక్తరమేశధామము జనవ్రాతంబు వీక్షింపఁగన్ ౯౮

తే॥ గీ॥ తిరుగ శ్రీహరి వేంచేయ నరవరుండు
ధరణిసురులకు మఱునాఁడు పరమభక్తి
సరసమృష్టాన్నములు వెట్టి, చరమధర శి
ధరదరీవివరమునకుఁ దరణి సనిన ౯౯

శా॥ సారక్షుత్త్రినుజన్మకేతనకనచ్ఛాబిమీకరస్వచ్ఛవి
స్తారాంశుచ్ఛట లష్టదిక్కులను నాచ్ఛాదింపఁగా వేడ్కతో
సారధ్వానితరుక్మకుంభవిలసత్సౌందర్య మాస్యందనం
బారోహింపఁగఁ జేసె నిందిరను దైత్యధ్వంసినిన్ భక్తితోన్ ౧౦

ఆ॥ వె॥ స్యందనస్థుఁ డైనచక్రిని సేవించు
జనులు భువినిఁ దిరిగి జన్మ మెత్త;
రమృతపదముఁ గొందు; రానందమున నుం
రందు కేమి సందియం బటంచు. ౧౦

కం॥ దర్పకజననీజనకుల
కర్పించిరి సకలజనము లగణితభక్తిన్
గర్పూరారాత్రికలను
నేర్పునఁ గానుకలతోడ నిర్మలమతు లై ౧౦

సీ॥ కంధిరాట్కన్యకాకలితవక్ష! పరాకు;
కర్బురసంహారకర! పరాకు;

పశుపతినుతదివ్యపాదపద్మ! పరాకు;
పన్నగారిధ్వజ! బహుపరాకు;
జఠరాంతరాలుఠజ్జలజజాండ! పరాకు;
స్మరశతకోటిసుందర! పరాకు;
పృషదశ్వభక్తభుక్పింఛమౌళి! పరాకు;
సకలాఘవిషజాంగలిక! పరాకు;

తే॥ గీ॥ మిత్రశశినేత్ర! కర్పూరచిత్రినేత్ర!
పత్రిరాజన్యకంఖాణ! వృత్రహరణ
నీలనిభగాత్రి! నీళావనీకళత్రి!
బహుపరా కని మాగధుల్ పరిస్తుతింప. ౧౦౩

సీ॥ రంభోర్వశీమేనకాఽంభోరుహాననా
సముపారసతులు లాస్యములు సలుప;
నిత్యసూరిప్రపన్నాన్యత్యగుణాఢ్యులౌ
సద్వైష్ణవులు శ్రుతుల్ సదువుచుండ;
మణిగణోజ్జ్వలవిభూషణభూషితాంగులై
భూసురు లగ్రభాగమునఁ జనఁగ;
భేర్యాదివాద్యగంభీరరావంబులు
కర్ణపేయముగ నాకసము ముట్ట;

తే॥ గీ॥ విమలకరదీపికాసహస్రములు సెలఁగ
రామధరణీశసహితులై భూమిసురవ
రాదిసర్వజనంబులు మోదమునను
రథముతోఁ గూడి తిరువీది రమణఁ జనఁగ. ౧౦౪

తే॥ గీ॥ చక్రిబాణంబు లలరెను "శక్రివైరి
చక్రి మీ రేయి ధారుణీచక్ర మవియ
శుక్రనిర్గతకీలోగ్రచక్రిచక్ర
మమితచక్రంబు లై వచ్చె" ననుచుఁ బొగడ. ౧౫౯

కం॥ ఆకాశబాణములు సుర
లోకసమీపమున కెగసె; లోలాత్మకు లై
పాకద్విణ్ముఖవిబుధులు
చీకా కై "యింక నేమి సేయుదు?" మనఁగన్ ౧౬౦

తే॥ పెట్లగోవులు బాణముల్ బిరుసులు మొద
లైన వన్నియు లంక యం చమరఁ జేసి
సూత్రపుత్రిక నంజీవపుత్రిరీతి
నొనరఁ గావించి చిత్రభానుని రగుల్ప. ౧౬

చ॥ మును దశకంఠపూర్వరము మోదముతోఁ బృషదశ్వసూతి! పెన్
గినుకఁ గృపీటయోనిశిఖఁ గీల్కొనఁ జేసినయట్లు వ్రేల్మిడిన్
ఘనబహుళస్ఫులింగములు గప్పుచుఁ బుత్రిక వచ్చి వత్తికిన్
గొనఁ దగిలించి పోవఁగ నకుంతత నేర్చిన నొక్క పెట్టునన్ ౧౬

మ॥ స్ఫురదుర్వీధరకందరంబులు హరిచ్ఛండాలశూర్పశ్రుతుల్
కరముల్ భేదిలఁ జేయుచప్పుడుల నాకాశస్థలిన్ గప్పి దు
స్తర మై తారలఁ దాకి రాలె ననుచందం బొప్పె నాశ్చర్యతన్
నరసందోహము సూచుచుండ నపు డానక్షత్రబాణావళుల్ ౧

తే॥ గీ॥ ఇవ్విధంబునఁ దిరువీది నేగి మఱల
నరుగుదేరఁగ మఱునాఁడు హరినిఁ దురగ
వాహనాఽరూఢుఁ గావించి వైభవమునఁ
బాఱువేటకుఁ గాంతారపథముఁ బట్టె. ౧౧౦

చ॥ చని మృగయావినోదమును సల్పి నిశీథినివేళ వచ్చుచో
వనరుహపాణిసన్నిధినివాసుని శ్రీతిరుమంగయాళ్వా
రనియెడుచోరశేఖరుని నశ్వముమీఁదటఁ జేర్చి తస్కరుల్
సని హరిసర్వవస్తుచయసంగ్రహణంబును జేసి తెచ్చినన్ ౧౧౧

తే॥ గీ॥ చామరాఽదికభూషణజాల మెల్ల
సంగ్రహించుక చోరులు సనినఁ; జక్రి
లచ్చివాకిటిముందర వచ్చి నిల్చి
'తలుపుఁ దెరువు' మటంచును బలుకుటయును. ౧౧౨

సీ॥ "ఇందు రాఁ బని యేమి యీ రేయి? మీ రెవ్వ?"
రన; "మీనరూపుఁ డీయనఘుఁ" డనిన;
"మీన మైన జలంబులోనె యుండు" నటన్నఁ;
"గచ్ఛపవేషుఁ డీఘనుఁ" డటన్నఁ;
"గచ్ఛపం బిలక్రిందఁ గాని యుండ" దటన్నఁ;
"గిరివర్ష్మధరుఁ డైనహరి" యటన్నఁ;
"గిరి విపినంబులోఁ దిరుగు" నంచన; "నర
హరి" యన; "హరి యైన నద్రిగుహనె;"

తే॥ గీ॥ వామనుఁడు బిచ్చ మెత్తును; వరకుఠారి
యడవి కేగును; 'రా' జన నాకసమున;
హాలి మహిన్ దున్ను; బౌద్ధుఁ డన్యమతవర్తి;
'కలికి' యన్నను జిలుకలకొలికి గాదె". ౧౧౩

తే॥ గీ॥ అనిన "మృగయావిహారి వై యలసినాఁడు
తలుపుఁ దెరువుఁడి; హరియె; మీతలఁపులోని
కోర్కె లీడేర్చు" నన నొక్క కువలయాక్షి
వాకి లెడలించి హరికి నివాళి యిచ్చె. ౧౧౪

కం॥ ఘనమణికాంచనసింహా-
సనమున వరపాంచరాత్రశాస్త్రజ్ఞులు శ్రీ
వనితను హరి నుపవేశన
మొనరిచి హారతుల నిచ్చి రుత్సాహముతోన్ ౧౧

తే॥ గీ॥ అంత మఱునాఁట నవభృథం బాచరించి
పుష్పయాగంబు రాతిరి పొసఁగ సల్పి
భూరిదక్షిణ లమితముల్ భూసురులకు
నొసఁగి భూపతి నిజకీర్తి నెసఁగఁ జేసె. ౧౧

కం॥ ప్రతివత్సర మిట్టులె శ్రీ
పతికల్యాణోత్సవంబు పార్థివవరుఁ డా
శ్రితవత్సలుండు భక్తిన్
సతతము నొనరించుచుండు సంయమివర్యా! ౧

కం॥ రామనృపాలునిసోదరి
'రామమ్మ' యటంచుఁ గలదు; రాజితకీర్తి
సోమాంబుజభూవిలస
ద్భామామృతహైమధరవితానముఁ దెగడున్ ౧౧౮

కం॥ "అనసూయగుణగణంబుల
ననసూయయె యనఁగ వచ్చు; హరిపదయుగభ
క్తిని నల శబరియె సమ" యం
చనఁ దగు రామమ్మతోడ నన్యులు సములే! ౧౧౯

కం॥ తమ్ముఁడగు రామభూవరు
నమ్మానిని సూచి పలికె "నమ్మకడుపునన్
నెమ్మిని మన ముదయించితి;
మిమ్మహి హరిసేవ సేసి యెసఁగితి వీవే. ౧౨౦

చ॥ ఘనమగుకీర్తివెన్నెలలు గాయ బుధాళిచకోరపాళి నిన్
వినుతి యొనర్చుచుండఁగను వేమఱు నే విని సంతసించి నీ
వనియెడునావతో భవమహార్ణవ మీఁదెద నంచు నున్నదా
నను; హరిసేవ సేయుటకు నాకు నుపాయము సెప్పవే" యనన్ ౧౨౧

వ॥ అనిన రామభూపాలుండు. ౧౨౨

కం॥ "అక్కా! కేశవసేవకు
మిక్కిలి నిఁక నేమి గలదు? మేలగు మఱి నీ
విక్కడ హరిసన్నిధిలో
నొక్కమహాగోపురంబు నొనరింపు" మనన్ ౧౨౩

కం॥ శిల్పివరేణ్యుల నప్పుడె
పిల్పించి మహోజ్జ్వలైకపృథుతరఫణిరా
ట్కల్పమహాద్వారంబునఁ
గల్పించెను గోపురంబు ఘనతరభక్తిన్ ౧౨౬

సీ॥ "ఆధారరహిత మీయమరాలయ" మటంచు
ధాత వెట్టినపోటిస్తంభ మనఁగ;
"స్వామి నీక్షించఁగాఁ బ్రేమతో నేతెంచి
యలర నిల్చినహిమాచల" మనంగ;
"నమరాశనఘటంబు నమసి జల్లున దిగ
జారెడిఘనసుధాధార" యనఁగ;
"మురహరుభక్తాళిఁ బ్రోవంగ నిడినని
శ్రేయసాయతననిశ్రేణి" యనఁగ,

తే॥ గీ॥ శుభ్రతానిర్జితోజ్జ్వలాదభ్రశార
దాభ్రవిభ్రాజితాభ్రాపగాభ్రదంతి
శుభ్రవారిజమహితసితాభ్రదీప్తి
గలమహోదగ్రగోపురం బలరుచుండె ౧౨౭

వ॥ అది మరియును దరుణతరణికిరణవిభవవిభాసమానాసమానసాలభం
కాపుంజమంజులకరకంజకలితసీరాజనదీపికోజ్జృంభితశాతకుంభగంభీరశు
భస్తంభవిరాజితంబును; నక్షుద్రహర్యక్షతరక్షుమృగఖగజగతీరుహావి
త్రవిచిత్రితాపత్రితిభాసమానపత్రితిమావితానఖచితబాహ్యైడూకంబున
వదనబింబప్రతిబింబకరవిమలతరముకురబింబస్థగితచతురాశాంతర్భి

కాగ్రప్రదేశంబును; దదుపరి సమస్తదిగంతరాళాంతరవికీర్యమాణహరిత కాంతిచ్ఛటాసముదయసహితమరకతవ్రాతపరిచ్ఛన్నవలభిభాగంబును; నిగన్నిగాయమానసగారాతినీలోపలజాలరచితసలలితవాతాయనవితానంబును; సాంద్రతరశరచ్చంద్రచంద్రికోపమానవజ్రోపలసంఘటితనిశ్శ్రేణీశ్రేణీయుతంబును; సంతతనిరీక్షణజనితవిస్మయానందకందళితబృందారకబృందహృదయారవిందాభ్రంకషశిఖరప్రకాశితంబును; సంభృతగదాదండనిరర్గళబాహార్గళశోభితజయవిజయపాలితబహిర్ద్వారోభయప్రదేశంబును నైనయమ్మహాగోపురద్వారంబున శ్రీమదంజననగాగ్రరంజితుం డగుశ్రీమద్వేంకటరమణుండు శ్రీమదలమేల్మంగానాంగనాసహితంబుగా సకలజనబృందంబులున్ జూడ నీడోద్భవాధిపారూఢుం డై తిరువీదిని వేంచేయుటకు నిర్గమించుసమయంబున; విభీషణగుణమణిగణభూషణుం డరిభీషణుం డైనతూముకులపయఃపారావారరాకానిశాకరుం డగురామత్క్ష్మాపాలుండు హస్తన్యస్తమంజులచామరప్రశస్తుం డై పార్శ్వంబునం జనుచుండ; వందిబృందంబులు వందనంబులు సేయుచుం వేత్రధరులు "వేత్రవతీభర్త! రతిస్వామి! బహుపరాకు! హెచ్చరి యని కైవారంబులు సేయుచు సందడించుమందిని ముందర నడచుండ; వారవనితాజనంబులు దమ కిచ్చు మెచ్చులకునై యచ్చరమింటులరీతి హెచ్చుగాం దమకు వచ్చినటుల విచ్చలవిడి నటించుయువజనంబుల నచ్చికబుచ్చికలు సేయుచుం, బురోభాగంబునం జుండం; జరమభాగంబున నందసునందసనందనబృందారకాచార్యు బలె వేదపారాయణంబు సలుపుచు శ్రీవైష్ణవబృందంబులు ననుచుండ గవినికరంబు విద్యోతమానగద్యపద్యవచనరచనాచాతుర్యంబులు నెపుచుండ; నారదతుంబురూపమానగాయకసముదయంబు తానమా

విధానంబుల గానంబు సేయుచుండఁ; బురజననివహంబులు స్వకీయసతీయుతంబుగా జెప్పలు విప్పక తప్పక చూచుచు గుంపులుగుంపు లై నిలింపులసొంపు దీపింపఁ "దోరం బగునిమ్మహాద్వారగోపురంబునిర్మాణం బొనర్చినవా రెవ్వరో!" యనిన; "సకలనృపాలమౌళి యగురామభూపాలుసహోదరియు, విబుధజనమందిరాళిందసుందరమందారాఽరామ మ్మగురామమ్మ" యని యొకరి కొకరు చేతులన్ జూపుచు నరుదెంచునపుడు; భేరీధాంధణధంధణాఽయమానబంధురనినదంబు సుధాఽంధశిపరిపంథిరాజలోకంబు విని భయభ్రాంతచైతన్యు లగుచు "శక్రయుతంబుగా నవక్రపరాక్రమంబున సక్రోధుం డై చక్రి మనమీఁదఁ జక్రప్రయోగంబు సేయం జనుదెంచెనో!" యని శంకాఽఽతంకసంకలితమానసు లగుచుండ; లెక్క సేయ నెవ్వరికి శక్యంబు గానియమ్మహాసేవావైభవంబు, స్వర్ధామంబురీతి ఖచరాధిపపరివేష్టితంబు నై, గ్రహమండలంబుభాతి బుధశనైశ్చరయుక్తంబు నై, మానసకాసారంబుచెలువునఁ గవివ చావైలక్షణ్యంబు నై, బదరికాఽశ్రమంబుచాడ్పున నరనారాయణప్రకాశితంబు నై, యయోధ్యానగరంబుపోలె రామావనీపాలపరిపాలితంబు నై, నాగలోకంబువిధంబునఁ జక్రిప్రకాశితంబు నై యుండె; నంత:— ౧౨౬

కం॥ గోపురవరమందిరఘన
గోపురకలశముల ముద్దుఁ గొనుచున్నవి; యా
గోపురశిఖరాగ్రము లవి
గో! పురమునఁ జెలఁగును; గనుఁగొను! మునితిలకా! ౧౨౭

క॥ అని యివ్విధమున నారద
మునిగణచంద్రుఁడు విశేషమోదయుతుం డై,
ఘనతర ఫణితిని శంభుఁడు
వినిపించిన విస్మయమున విని చనె స్వేచ్ఛ్ఁ. ౧౨౮

ఫ ల శ్రు తి

సీ॥ ప్రాచీదిశాధీశ భాసురవిభవంబు,
స్వాహాసతీభర్త్ర సదృశశుచిత,
ధర్మరాజసమానధర్మగుణావాప్తి,
పుణ్యజనాధిపాగణ్యశౌర్య,
మంభోధిరాజన్యగంభీరభావంబు,
పృషదశ్వసంకాశపృథులబలము,
రాజరాజనిధానరాజమానధనంబు,
నార్యేశ్వరోజ్జ్వలావార్యకీర్తి,

తే॥గీ॥ శ్రీమదలమేలుమంగాపరిణయ మిలను
వినినచదివినవ్రాసినజనుల కెల్ల
శ్రీనివాసుండు నిచ్చు విస్తీర్ణకరుణ
ననుచు సూతుఁడు శౌనకమునికిఁ జెప్పె. ౧౨౯

ఆ శ్వా సాం త ము

శా॥ సోమాఽప్తానుజకంఠలుంఠనశితేషుప్రాంచదస్తోకస
ద్ధామాసర్ఘ్యమణీగణప్రథితదివ్యాప్తాసనందానితో
ద్దామజ్యోద్భవభూరిశబ్దభయభృత్రైలోక్యగ్రశౌర్యాహిత
స్తోమాంహోయుతహృత్సమూహసురరాట్సుత్యాంఘ్రి
దివ్యాంబుజా! ౧

వ న మ యూ ర ము

అక్షరనృపోక్షకృతహాస్తివరరక్షా!
శిక్షితవిపక్షసరసీరుహానిభాక్షా!
వృక్షచిరదక్షనత! శ్రీకలితవక్షా!
ఋక్షవిభులక్షణసమీరితకటాక్షా! ౧౩౧

గ ద్య ము

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాస్వాదనతుంది
లేందిందిరాయమానమానసతూముకుంశక్షీరపారావార
రాకాసుధాకర రామక్ష్మాపాలసుపుత్రపవిత్రచరి
త్రాక్షీణాంధ్రగీర్వాణచణ రామచంద్రావనీ
పాలవిరచితశ్రీమదలమేలుమంగా
పరిణయం బనుమహాప్రబం
ధంబునందుఁ జతుర్థాశ్వాసము
సర్వంబు సంపూర్ణంబు

శ్రీ ముద్రణాలయము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ (దక్షిణ.)